BHASAMATHI

Prof. P. Sumathinarendra



సుమతీనరేంద్రగారికి ప్రాచీన సాహిత్యం మీద ఎంత పట్టు వుందో, ఆధునిక ప్రక్రియల మీద అంత అవగాహన వుంది. ఆధునిక కవిత్వంలోని ప్రతీకాత్మకతను ఎంత బాగా వివరించగలరో, ప్రాచీన కవిత్వంలోని అలంకారాల ప్రయోగ వైశిష్ట్యాన్ని, వైలక్షణ్యాన్ని అంత గొప్పగానూ విశ్లేషించగలరు. ప్రాచీనతకు, ఆధునికతకు మధ్య ఒక సయోధ్యను, సమన్వయాన్ని ఆమె సాధించారు. ఈ సమన్వయ దృక్పథం ఆమె సాహిత్య విశ్లేషణలోని విశిష్టమైన గుణం. ఆ సమన్వయ దృక్పథంతో ఆమె మార్గం ఎంత సంయమనంతో కూడిందో ఒక్కో వ్యాసం పాఠకులకు రుచి చూపిస్తుంది.

**BALAKRISHNA BHARATHI**
**Hyderabad**

భాసమతి • ఆచార్య పి. సుమతీనరేంద్ర

# భాసమతి

ఆచార్య పి. సుమతీనరేంద్ర

**BHASAMATHI**
Collection of Literary Essays
by
**Dr P. Sumathi Narendra**

**First printed : February 2007**

Price : Rs. 90/-

For Copies
**Balakrishna Bharathi**
**12-13-785, Tarnaka**
**Secendurabad - 500 017**
**Phone : 040- 27014500**

**and**

**Visalandhra Publishing House, Hyderabad and all Branches**
**Prajashakti, Chikkadpally, Hyderabad and all Branches**
**Navodaya Book House, Kachiguda X Roads, Hyderabad**
**Telugu Book Book House, Kachiguda X Roads, Hyderabad**
**Disha Pusthaka Kendram, Chikkadpally, Hyderabad**

Type Setting
**Smt. K. Saraswathi**
303, North Block, Dream Home Shalivahana Towers
Shalivahananagar, Moosarambagh, Hyderabad-36
Phone : 040-66367452

Printed at
**Karshak Art Printers**
40 - APHB, Vidyanagar
Hyderabad - 500 044
Phone : 040 - 27618261

# ఇందులో...

# పుస్తకంలోకి వెళ్లే ముందు...

ఇది నా రెండో వ్యాససంపుటి. మొదటిది 'వ్యాసమతి' పేరుతో 1996లో వచ్చింది. పదేళ్లకు మళ్లీ 'భాసమతి' రావాలని అనుకొన్నాను అచ్చు వేయడంలో నాకున్న అనాసక్త యోగమే 2006లో ఇది రాకపోవడానికి ప్రధాన కారణం. 2006లో నా తొలి కవితాసంకలనం 'మొలకెత్తిన అక్షరం' రావడం కొంత ఊరటను, మరెంతో ఉత్సాహాన్ని ఇచ్చింది. ఎప్పుడైనా ఎలాగైనా విమర్శ కంటే కవిత్వానికి తొందర ఎక్కువే!

అధ్యయనంలో లోతులకు వెళ్లే కొద్దీ సందేహాలు కొత్త పుంతలు తొక్కుతాయి. మనం వ్రాసింది మనకే నచ్చని సందర్భాలు రాను రాను ఎక్కువవుతాయి. అయినా ఆయా సమయాల్లో నేను ప్రతిపాదించిన కొన్ని అభిప్రాయాలను పాఠకుల ముందు పెట్టడానికి చేసిన ప్రయత్నమే 'భాసమతి'.

మల్లెలూ, మరువం, కనకాంబరాలు కలిపి కట్టిన ఈ వ్యాసకదంబం సాహిత్యకులను అలరిస్తే కొంత తృప్తి! ఈ వ్యాసాలు చాలావరకు వివిధ విశ్వవిద్యాల యాలలో జరిగిన యుజిసి జాతీయ సదస్సులలో సమర్పించినవే. సాధారణంగా సదస్సులలో సమర్పించిన వ్యాసాలు సగం వాయులీనమవుతాయి. మిగతా వాటిలో సగం కాలగర్భంలో కలిసిపోతాయి. కొన్ని కాలం కలిసి వచ్చినప్పుడు అక్షరాకృతి ధరిస్తాయి. అలాంటి కొన్ని మాత్రమే ఈ 'భాసమతి'లో చోటుచేసుకొన్నాయి. సాహిత్య చర్చలలో ప్రస్తావనకు పాత్రమైతే ఇవి సార్థకమైనట్లే.

అక్షరాభ్యాసం మొదలు అధ్యాపనం చేసేవరకు మార్గదర్శనం చేసిన గురువులందరికీ ప్రణామాలు! నిరంతరం నా క్షేమాన్ని, సంతోషాన్ని ఆకాంక్షించిన అమ్మమ్మ, తాత - రంగనాయకమ్మ, ఎల్లంరెడ్డి బాలకృష్ణారెడ్డి దంపతులకు, తండ్రి పోలంరెడ్డి నారాయణరెడ్డికి నా నమస్సుమాంజలులు!

జీవితంలోనే కాదు విద్యావ్యాసంగంలో కూడా నా పురోభివృద్ధికి అండగా నిలిచిన భాస్వంతుడు శ్రీపాల్వాయి దత్త నరేంద్రరెడ్డికి ప్రీత్యంజలి!

అన్నదమ్ములతో నా అనుబంధం ప్రగాఢమైంది. నా జీవితంలో అదొక ప్రధాన పార్శ్వం. వారికి నా మన్ననలు! బంధుమిత్రులు మెండుగ ఉండడం నాకు లభించిన గొప్పవరం! వారందరినీ ఈ సందర్భంలో ఇష్టంగా గుర్తు చేసుకొంటున్నాను. అధ్యాపక మిత్రులకు, సహృదయ విమర్శకులకు అభివాదాలు. శిష్యసంపద దండిగా ఉండడం గురువుగా నాకు లభించిన గౌరవం. నేను చదువుకొన్నదీ, ఉద్యోగం చేస్తున్నదీ, అసలు నా ఉనికికి అర్థాన్నిచ్చిందీ ఈ పుస్తక ప్రచురణకు సముచితమైన ఆర్థిక సహకారం అందించినదీ ఉస్మానియా విశ్వవిద్యాలయం! తీర్చలేని రుణానికి గుర్తు చేసుకోవడం మాత్రమే కర్తవ్యం!

పుస్తక ప్రచురణలో నాకు తోడ్పడిన డా. వెలుదండ నిత్యానందరావు, శ్రీ కాసుల ప్రతాపరెడ్డి నా శిష్యులే. వారిని పుత్రనిర్విశేషమైన వాత్సల్యంతో ఆశీర్వదిస్తున్నాను. పుస్తకం మీ ముందుంది. అందుకొని అధ్యయనం చేయండని సహృదయ పఠితృలోకాన్ని అభ్యర్థిస్తూ ....

- సుమతీనరేంద్ర



# అన్నమయ్య సంకీర్తనలు స్వతంత్ర భావుకత

అన్నమయ్య సంకీర్తనలలో స్వతంత్ర భావుకత సర్వత్రా వ్యాపించి ఉంది. కంటికి కనిపించకపోయినా గాలి ఉందని చెప్పగలిగినట్లే అన్నమయ్య స్వతంత్ర భావుకత ఎత్తి చూపనవసరం లేకుండా అనుభవైక వేద్యం అవుతుంది. ఎత్తి చూపడం ఎందుకంటే పాలలో దాగి ఉన్న వెన్నను తీయాలి కనుక. అయితే పాలను మరగ కాచి తోడు పెట్టి చిలికితే గాని వెన్న విడిగా చేతికి రానట్లే అన్నమయ్య పద సాహిత్యాన్ని అధ్యయనం చేసి మననం చేసుకొని మథనం చేస్తేనే గాని అందులోని భావుకత పూర్తిగా బోధపడదు. ఎల్లెడల వ్యాపించి ఉన్న పరమాత్మ తత్త్వం ఒక్కొక్కప్పుడు ఎంత వెదకినా అంతుబట్టనట్లే భావుకత సర్వత్రా అలుముకొని ఉన్న అన్నమయ్య పదాలలో అది ఒక చోట ఉందని మరొక చోట లేదని, దాని స్వరూపం ఇది అని ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం. మరొక విషయం ఇక్కడ చెప్పుకొని తీరాలి. భావుకత హృదయసంబంధి. సహృదయ భూమిక ఉన్నప్పుడే భావుకత మనోరంజకమవుతుంది. రసరమ్యభావ తరంగాలలో మనసు తెలియాడి ఆ జగత్తులో మళ్లీ మళ్లీ సంచరించాలనిపిస్తుంది. అన్నమయ్య కవిత్వం భావుకతకు పరమోదాహరణం.

అసలు భావుకత లేని కవిత్వం తీపి లేని చెరకుగడ లాంటిది. అలాంటి కవిత్వాన్ని చదివి అనుభూతి పొందేది ఏమీ ఉండదు. భావనిర్భరమైన కవిత్వమే ఎవరికైనా ఏ కాలంలోనైనా ఉపాదేయమైంది.

అన్నమయ్య పరమభావుకుడు. భాగవతోత్తముడు. శ్రీ వేంకటేశ్వరుని పదకుసుమాలతో అర్చించిన పదకవితా పితామహుడు. తరువాత వచ్చిన వాగ్గేయకారులందరికీ మార్గదర్శకుడు. అందుకే సంకీర్తనాచార్యుడయ్యాడు. అన్నమయ్య పదాలు సంగీత సాహిత్యాలను కలిపే వారధులు. తన భావాలను పదాలలో పొదిగి పదిలంగా మనకందించాడు. వాటి విలువలను గ్రహించలేని మనం చాలావాటిని పోగొట్టుకున్నాం. పోయినవి పోగా తక్కిన వాటినైనా మనం సరిగ్గా అర్థం చేసుకొని ఆనందిద్దాం.

అన్నమయ్య భావాలు నిసర్గ సుందరాలు. పండితుల మెరమెచ్చుల కోసం కాని, ప్రభువుల గండపెండేరాల కోసం కాని రాసిన పదాలు ఎంత మాత్రం కావవి. ఆత్మానందం కోసం గాని, కీర్తిప్రతిష్ఠల కోసం గాని అన్నమయ్య పాకులాడలేదు. అహరహం ఆ అలమేల్మంగాపతిని స్మరిస్తూ, భావిస్తూ, దర్శిస్తూ, లాలిస్తూ అతని నామాలను, లీలలను వర్ణిస్తూ, కీర్తిస్తూ అతని తోడిదే లోకంగా జీవించాడు. ఆడినా, పాడినా, పొగడినా, తెగడినా, పంతగించినా, పరిహాసాలాడినా అతనితోనే. ఆ పారవశ్యం మనకు అంతు చిక్కనిది. అయినా ఆ లోతులలో దిగి మునకలు వేసి అనర్ఘ రత్నాలను అందిపుచ్చుకోవచ్చు. కావలసింది పూనిక, సహృదయ భూమిక మాత్రమే. అన్నమయ్య భక్తి పారవశ్యంలో ఓలలాడుతూ అలవోకగా చెప్పిన పదాలలో భావకమలాలు ఒక్కొక్కప్పుడు చేతికి అందినట్లే అంది అంతలోనే దూరమవుతాయి. ఎందుచేతనంటే ఆ భావతీవ్రత భాషకు అందనంతటిది కావడం చేత కొంత, పాఠకులకు భాషా విషయకమైన పరిపూర్ణ అవగాహన కొరవడడం వల్ల కొంత.

అన్నమయ్య భావ నైశిత్యానికి పరమోదాహరణం ఈ పదం

ఏమొకొ చిగురుటధరమున
యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన
పత్రిక కాదు గదా

అధరాన్ని పత్రికతో ఉపమించడం భావుకతతో కూడిన అభివ్యక్తి. ఆకారాన్ని బట్టి, గుణాన్ని బట్టి కాక అనుభూతిని ఆధారం చేసుకొని వ్యక్తీకరించాడు అన్నమయ్య. ఆ పత్రిక విభునికి పంపిన సందేశం అట! ఎడనెడ నిండి కస్తురి పత్రిక మీద వ్రాత అనుకోవడం నవ్యతతో కూడిన భావుకత! పరమ రమణీయమైన అభివ్యక్తి!

'కలికి చకోరాక్షికి కడ కన్నులు కెంపై తోచినవి' ఈ ఎఱ్ఱదనం కోపంతో, అలుకతో, విచారంతో వచ్చినది కాదు. ఇది నిజంగానే రక్తవర్ణం' ప్రాణేశ్వరుపై నిలువున నాటుకున్న ఆ కొనచూపులు పెరుకగ ఆ నెత్తురు అంటి ఉంటుంది అని భావించాడు అన్నమయ్య. చూపులను శరాలతో పోల్చడం వరకే ఆగిపోయారు చాలమంది కవులు. అట్లాకాకుండా చూపుల శరాలు నాటుకోవడాన్ని, ఆ చూపులను బలవంతంగ వెనక్కులాగినపుడు కొనలకు మాత్రమే రక్తవర్ణం అంటుకోవడాన్ని అందంగ అభివ్యక్తీకరించాడు అన్నమయ్య. అంతేకాదు నఖశశిరేఖలను. వేసవి కాలపు వెన్నెల కాదుగదా అన్నాడు. వేసవి కాలపు వెన్నెల అనుభవించే కొద్దీ ఆహ్లాదకరంగ ఉంటుంది. ఇంకా ఇంకా అనుభవించాలని అనిపిస్తుంది. ఎంత వర్ణించిన తనివితీరని



హాయినిస్తుంది. అన్నమయ్య భావుకత్వం కూడ అటువంటిదే. ఈ ఒక్కపదం చాలు అన్నమయ్య భావుకత్వం ఎంత స్వతంత్రమైనదో, నూతనమైనదో, లోతైనదో తెలుసుకోవడానికి

"చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెరమోవికి చాంగుభళా"

మోవిని చిగురుతో పోల్చడం సర్వసామాన్యం. అన్నమయ్యే చిగురుటధరం అన్నాడు కదా ముందు గేయంలో కూడ. బింబోష్ఠం అనడం కూడ సామాన్యమే. దొండపండుతో కూడ పోలుస్తారు. ఇవన్నీ కవిసమయాలు. కోమలత్వాన్ని, ఎఱ్ఱదనాన్ని, నిండుదనాన్ని దృష్టిలో ఉంచుకొని చేసిన ప్రయోగాలు. అధరామృతం అని ఆ చుంబనం వలన కలిగే మధురానుభూతిని ఉద్దేశించి ప్రయోగించడం కూడ ఉంది. కాని అనుభవంలోకిరాని అమృతం రుచి ఎలా ఉంటుందో ఏమోగాని పంచదార మాత్రం మధురంగ ఉంటుంది. అందరికీ అనుభవం అయిన మాధుర్యం చక్కెరది. అందుకే అన్నమయ్య చక్కెరమోవి అన్నాడు. రూపానికికాక తద్గత అనుభూతికి ప్రాధాన్యమిచ్చి ఆరెంటికి అభేదాన్ని ఆరోపించాడు. ఆ మోవి అనగానే తద్గత మాధుర్యం అనుభవానికి వచ్చేటట్లు వర్ణించాడు. ఆ తల్లిని చందన గంధి అన్నాడు ఆపదంలోనే. విభుడు చందన ప్రియుడు అందుచేతనే అయ్యాడు కాబోలు. స్వాభావిక వర్ణనలలో సౌందర్యం మంచులో తడిసిన మల్లెపువ్వులా ఉంటుంది.

"ఉన్నతి పతిపై ఒరిగి నిలుచు తన
సన్నపు నడిమికి చాంగుభళా"– అన్నప్పుడు నడుమును 'అస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరీ' అన్న మహాకవి శ్రీనాథుడు గుర్తుకు రాకమానడు. అయితే అది పండితుల మనసునకెక్కే పద్ధతిలో ఉంది. సామాన్యులకు అది బహుదూరం. 'సన్నపు నడిమి' అనడంలో అందం, లాలిత్యం, సహజత్వం ఉన్నాయి. విన్నవెంటనే ఒరిగి నిలిచిన శోభ పరిమళంలా మనసును చుట్టుకొంటుంది. అన్నమయ్య భావుకత అందని మ్రానిపండు కాదు. అందరికీ అనుభవమయ్యే పిల్లతెమ్మెర!

శ్రీకృష్ణుడిని ఎంతమంది సంస్కృత, ఆంధ్రకవులు ఎన్ని విధాలుగా వర్ణించారో చెప్పనలవి కాదు. అన్నమయ్య ఆ మోహనాంగుని మనం అత్యంత విలువైనవిగా భావించే నవరత్నాలతో పోల్చి చెప్పాలనుకున్నాడు. ఆ చెప్పడంలో ఊరికే ఉపమించడం కాకుండా శ్రీకృష్ణుని వివిధ దశలను, అద్భుత చేష్టలను అసామాన్యంగా వర్ణించాడు. అంతా ఒక్క పదంలోనే పొందుపరిచాడు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన చేశాడు.

ఆ చిన్నిశిశువు, కొంటెబాలుడు, లీలామానుష విగ్రహుడు కనుల ముందు సాక్షాత్కరించేటట్లు చేశాడు.

నవరత్నాలను, నవరసాలను కలగలిపిన ఈ పదం కవిత్వానికి ఒక నిర్వచనం! వినూత్న రత్నకాంతులతో మెఱసిన పదం ఆనందపారవశ్యంలో తేలియాడేటట్లు చేస్తుంది.

"ముద్దుగారే యశోద ముంగిటి ముత్యము వీడు

తిద్దరాని మహిమల దేవకీసుతుడు"

ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డడు శ్రీకృష్ణుడు. ఈ పదంలో ప్రత్యేకత ఏమిటంటే శ్రీకృష్ణుని గొల్లపిల్లవాడిగాను, పరమాత్మగాను అలవోకగ వర్ణించాడు అన్నమయ్య. "అంతనింత గొల్లెతల అరచేతి మాణికము, పంతమాడే కంసునీ పాలివజ్రము" అంటాడు, నమ్మిన వారికి కొంగు బంగారం, పంతగించిన వారి పాలి వజ్రాయుధం ఆ దేవదేవుడు! అన్నీ ఆతడే అనుకొన్నవారికి సులభుడే. చెంతలో మాలోనున్న చిన్న కృష్ణుడు అన్నాడందుకే. "రతికేళి రుక్మిణికి రంగుమోవిపగడము" అన్నప్పుడు శృంగారం, పంతమాడే కంసునిపాలి వజ్రము అన్నప్పుడు వీరం, మితి గోవర్ధనపు గోమేధికము అన్నప్పుడు అద్భుతం', సతమైశంఖ చక్రాల సందుల వైఢూర్యము అన్నప్పుడు శాంతం, కాళింగుని తలలపై కప్పిన పుష్యరాగము అన్నప్పుడు రౌద్రము, ఒకదానివెంట మరొకటి రస భావ తరంగాలు ముప్పిరిగొని వస్తాయి. ఏలేటి శ్రీ వేంకటాద్రి ఇంద్రనీలము అన్నప్పుడు పర్వతాగ్రంపై వెలిగే నీలమేఘం, వెనువెంటనే నీలమేఘశ్యాముడు స్ఫురిస్తారు. కాళిదాసు మేఘసందేశంలో చేసిన వర్ణన గుర్తుకు వస్తుంది. అక్కడ మేఘం, ఇక్కడ మేఘవర్ణుడు వర్ణనీయ వస్తువులు!

"కాంతుల మూడు లోకాల గరుడ పచ్చపూస" అంటూ శ్రీకృష్ణుని దివ్యత్వాన్ని, "గతియై మమ్ము గాచె కమలాక్షుడు" అంటూ ఆ దేవదేవుని దయాగుణాన్ని వర్ణిస్తూనే "బాలుని వలె తిరిగే పద్మనాభుడు" అని శ్రీకృష్ణావతార తత్వాన్ని గుర్తింపజేస్తాడు. క్రమంగా యశోద ముంగిట ముత్యం గోవర్ధనపు గోమేధికమై, కంసుని పాలి వజ్రమై, గొల్లెతల చేతి మాణిక్యమై, కాళింగుని తలపై పుష్యరాగమై చివరగా శ్రీ వేంకటాద్రి ఇంద్రనీలమై భాసించడం కనిపిస్తుంది. ఈ ఒక్క గేయం ఒక భాగవతం అంటే అతిశయోక్తి కాదు. ఆ దేవదేవుని నానా రూపాలను నవరత్న సదృశంగా వర్ణిస్తూ, పరవశిస్తూ, ఆ లీలలను దర్శిస్తూ, ఆ వైభవాన్ని తాను దర్శించడమే కాక విన్నవారికి దర్శనీయం చేస్తూ కీర్తనీయుడయ్యాడు అన్నమయ్య. ఇద్దరమ్మల ముద్దుబిడ్డడిని, అతని చేష్టలను పరమ భావుకతతో వర్ణించాడు. ఆ శ్రీకృష్ణుడే ఈ వేంకటేశుడని ప్రకటించాడు.



అనిదం పూర్వం, అనితర సాధ్యం అన్నట్లు చేసిన ఈ వర్ణన అన్నమయ్య ప్రతిభకు అద్దం పడుతుంది. తలచిన కొలదీ తలమునకలయ్యే భావశబలత ఇందులో పరిపూర్ణంగా గోచరిస్తుంది.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలో చివరగా వచ్చే మంగళాశాసనంలో 'స్వామి పుష్కరిణీ తటే' అని ఉంటుంది. అన్నమయ్య ఆ స్వామిని పలుమార్లు 'కొండలలో నెలకొన్న కోనేటిరాయడువాడు' అని కీర్తించాడు. దానిననుసరించే 'స్వామి పుష్కరిణీ తటే' అని ప్రస్తుతించారు సుప్రభాతంలో. తెలుగు భాషా పరిమళం అన్నమయ్య పదాలలో అడుగడుగున వ్యాపించి ఉంది. ఆ పలుకుబడి అతి సామాన్యమైన భాషా పరిజ్ఞానం కలవారికి కూడా అందుబాటులో ఉంటుంది. ఆ కోనేటిరాయడిని కొలనిదేవర అని కూడా పిలిచాడు. ఏడుకొండల సామికి కొండలతో ఉన్న అనుబంధాన్ని కూడా తరచుగ ప్రస్తావించాడు అన్నమయ్య. కొండలలో నెలకొన్న కోనేటిరాయడు కొండలంత వరాలు గుప్పెడివాడు అని కీర్తించాడు. ఎవరికీ అర్థం కాని, అనుభవంలోకి రాని బ్రహ్మపదార్థం కాదు భావుకత! సహృదయ సంబంధి! అనుభవానికి అందమైన నిర్వచనం భావుకత! అది అన్నమయ్య పదాలలో దొరికే అరచేతి వెన్నముద్ద! ముగ్ధ గోపకాంతల మనసులలో రంగవల్లి!

అన్నమయ్య ఆ స్వామిని ఎన్నెన్ని పేర్లతో పిలిచాడో లెక్కలేదు. అందులో 'కోరి మమ్ము ఏలినట్టి కులదైవమా', 'గారవించి దప్పి తీర్చు కాలమేఘమా'లాంటి భావుకతతో కూడినవెన్నో. పిలిస్తే పలికే కులదైవం అట ఆ శ్రీనివాసుడు. దప్పి గొన్నవాడికి కారుమబ్బు కనిపించగానే సేద తీరుతుంది. అలాగే భగవంతుడిని చూడాలని తపించే భక్తుడికి సాక్షాత్కరించే స్వామిని కాలమేఘం అనడం భావబంధురంగా ఉంది. నల్లనయ్యను కాలమేఘం అనడం సార్థక పదసంయోజనం. కాలాతీతుడైన పరబ్రహ్మను కాలమేఘం అనడం ఔచితీ పరిశోభితం! 'భావింప కైవసమైన పారిజాతమా' అన్నాడు. ఇది చేతికి చిక్కే పారిజాతపుష్పం కాదు. భావిస్తే భావనకు అంతుబట్టే పారిజాతం! చేవదరి కాచినట్టి చింతామణీ, కామధేనువా అని పిలిచినప్పుడు కూడా ఆర్తితో కొలిచే భక్తునికి అన్నీ తానై నిలిచే పరమాత్మ సాక్షాత్కరిస్తాడు. 'చెడనీక బ్రదికించే సిద్ధమంత్రమా, రోగాలడచి రక్షించే దివ్యౌషధమా' అన్నప్పుడు కూడా ఆ పరతత్త్వం దర్శనమిస్తుంది. చిట్టచివరగా 'ప్రాణ బంధుడా' అని పిలవడంలో భావతీవ్రత గోచరిస్తుంది. పరమాత్మలో లీనం కావాలనే తపనకు అది పరాకాష్ఠ! భక్తుడికి భగవంతుడి కంటే బంధువెవరు?

అన్నమయ్య పలుకుబడి సామాన్యునికి ఒరవడి! విష్ణువును ఎద్దు అని భావించిన కవులు చాలా అరుదు. అన్నమయ్య రైతులకు ప్రాణప్రదమైన ఎద్దుతో

స్వామిని ఉపమించాడు. 'పొలమెల్ల దిరిగిన బోడెద్దు' అన్నప్పుడు పొలం అంటే విశ్వం అని, తిరిగిన అంటే వ్యాపించిన అని, బోడెద్దు అంటే బంధాలు లేనట్టి భగవంతుడని భావించుకోవాలి. ఇంకా ముందుకుపోయి ఆ స్వామిని

పురములు సాధించ బూనినప్పుడు
భూమి భరమెత్తి నిలిచిన బండెద్దు – అన్నాడు. భూభారాన్ని మోయడానికి ఎంత శక్తి ఉండాలి!

పరివోని మందల పసుల బోదోలి
శ్రీవరుడై రోగట్టు పడిసెద్దు – అన్నప్పుడు యశోదమ్మ రోలకు గట్టిన కృష్ణుడు దర్శనమిస్తాడు. ఇంతటితో ఆగలేదు అన్నమయ్య స్వతంత్ర భావుకత.

గోవైన భూదేవి నూరిమి జేకొని
లావైన వృషభాచలపుటెద్దు
మోపగ వేదాలు మొల్లమైసిరి తోడ
శ్రీ వేంకటాద్రి మించిన మాయలెద్దు

వరాహావతారంలో భూదేవిని ఎత్తి పట్టాడు శ్రీ మహావిష్ణువు. కాని భూదేవికి ఎద్దుకు ఏమిటి సంబంధం అంటే వ్యవసాయం అనవచ్చు. ఎద్దు లేనిదే బుద్ధి ఉన్నా వ్యవసాయం సాగదు.

ఇంకా తరచి చూస్తే గోశబ్దానికి భూమి అనే అర్థం కూడా ఉందని స్ఫురిస్తుంది. భూదేవిని కాచిన విష్ణువు – ఆవును కాచిన వృషభమే! అప్పుడు ఆ స్వామిని ఎద్దు అనడంలో ఔచిత్యం సువిదితం! భావించే కొద్దీ రుచులూరే కమ్మని కవిత్వం అన్నమయ్య స్వంతం! సిరితో కూడిన వేదవేద్యుడు శ్రీ వేంకటాద్రిపై వెలసిన విభుడు, అనంతుడు, అప్రమేయుడు అంతటి వాడు గనుకనే మాయలెద్దు అని మురిపెంగా వర్ణించాడు భక్తాగ్రేసరుడు అన్నమయ్య. వృషభాద్రిపై కొలువై ఉన్న వృషభుడు కనుకనే మాయలెద్దు అయ్యాడు.

శేషశాయి అని విష్ణువును పోతన పదే పదే స్మరించాడు. శేషశాయికి మొక్కు శిరము శిరము అని కూడా అన్నాడు. అన్నమయ్య అలా కాకుండా శ్రీహరివాసాన్ని 'పదివేల శేషుల పడగల మయము' అని వర్ణించాడు. నిజానికి ఏడుకొండల వాడి ఆవాసం ఆ పడగలలో పదిలంగా దాగి వున్నట్లే కనిపిస్తుంది సామాన్యుడికి.

'భావింప సకల సంపద రూపమది' అని ఎంతో లోతైన భావాన్ని అలతి అలతి పదాలలో అలవోకగా వర్ణించాడు. ఆధ్యాత్మికత అనే సంపదకు ఆలవాలం ఆ



శ్రీహరివాసం. కోరుకొన్నవాడికి కొండలంత వరములు గుప్పెడి శ్రీహరివాసం! శ్రీకి నివాసమైన ఆ చోటు సకలసంపదరూపం! శ్రీనివాసుని సన్నిధిని మించిన పెన్నిధి ఉండదు.

'బంగారుశిఖరాల బహుబ్రహ్మమయము', 'బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే' అని చెప్పిన అన్నమయ్య బహు బ్రహ్మమయము అని ఎందుకన్నాడు. ఇక్కడ బ్రహ్మ అంటే హిరణ్యగర్భుడైన బ్రహ్మ హిరణ్మయత్వాన్ని వర్ణిస్తున్నాడని అర్థం చేసుకోవాలి. బంగారు వర్ణంతో వెలిగే శిఖరాలను చూస్తే బహుబ్రహ్మమయమనే భ్రాంతి కలుగుతుంది. ఇది సౌందర్యాత్మక వర్ణన! 'కైవల్య పదము వేంకట నగమదివో' అని సులభ సాధ్యుడే సుమా అనే నమ్మకాన్ని ప్రోది చేశాడు. 'కలౌ వేంకట నాయకః' అని కదా రూఢి!

'కొండలతిమ్మని కొయ్యమాటలతో ఒయ్యన తిట్టకురోరమ్మా' అని గొల్లెతలను మందలిస్తూ తాను యశోదయై ఆ దేవదేవుని కొండలతిమ్మనిగా భావించాడు అన్నమయ్య.

ఆ స్వామిని ఎంత ఆరాధించాడో అంతకంటే ఎక్కువ అలమేల్మంగను స్మరించాడు. ఆమె సొగసులను, లీలలను వలపు తీరులను వైవిధ్య భరితంగా వర్ణించాడు. ఒక పదంలో అమ్మతో 'తెలి కన్నుల నీ తేటలే కదవె/ వెలయగ విభునికి వెన్నెలలు' అన్నాడు. కంటి వెలుగులు వెన్నెలలు అనడం ఆర్ద్రత అద్దిన ఔపమ్యం. దయామృతాన్ని వర్షించే ఆ తల్లిచూపులు వెన్నెలలు – అంటే చల్లనివి అని భావం. ఆమె కృపాకటాక్ష వీక్షణాలు వెన్నెల వలె చల్లనివి. ఆమె కౌగిలి శ్రీ వేంకటేశ్వరునకు 'సిరినగరు' అన్నాడు అన్నమయ్య. శ్రీనివాసుని వక్షస్థలంలో శ్రీ మహాలక్ష్మి నివాసం ఉండడం వల్లనే ఆయనకా పేరు సార్థకమైంది. అయితే ఇక్కడ అన్నమయ్య ఆమె కౌగిలి ఆయనకు సిరినగరు అని వర్ణించడం విశేషం! ఆ పదంలోనే

"ముయ్యక మూసిన మొలక నవ్వు గదే
నెయ్యపు కప్రపు నెరిబాగాలు" – అని కూడా వర్ణించాడు. చిరునవ్వు, మందహాసం అనడం కంటే మొలక నవ్వు అనడం మనోహరం! మొలక నవ్వులతో మురిసిరి అని మరొక సందర్భంలో కూడా వర్ణించాడు అన్నమయ్య. 'కొలనిలోన మును గోపికలు మొలక నవ్వులతో మొక్కిరి నీకు' అని అందంగా చిత్రీకరించాడు.

"మెరయు శ్రీ వేంకటేశు మేనిసింగారముగాను
తరచయిన సొమ్ములు ధరియించగా
మెరుగు బోణి అలమేలు మంగయు తాను

మెరపు మేఘము కూడి మెరసినట్లుండె

అభిషేకానంతరం శ్రీ వేంకటేశుడు మేన సింగారంగా సొమ్ములు ధరిస్తే మేఘానికి మెరపు తొడిగినట్లున్నదట. అలుమేలు మంగ మెరుగుబోణి – మేఘం శ్రీనివాసుడు. అమ్మవారితో కూడిన ఆ శ్రీనివాసుని తనివిదీరా భావించి, తాను కనులారా కాంచిన రూపాన్ని మన కోసం కరవుదీరా వర్ణించాడు అన్నమయ్య. 'అలరులు కురియగ ఆడినదె అలకల కులుకుల అలమేల్మంగ' అన్నాడు మరొక పదంలో. ముంగురులు కదులుతుంటే, ఆ ముంగురులలో తురుముకొన్న పువ్వులు రాలుతుంటే ఆమె నాట్యమాడుతున్నదట. ఆ దృశ్యం ఒక్క అన్నమయ్యకే దృగ్గోచరం!

అలమేలుమంగా శ్రీనివాసుల కళ్యాణం లోకకళ్యాణకారకం. ఆ కళ్యాణ మహోత్సవాన్ని కనులారా కాంచిన అనుభూతిని కలిగించినవాడు అన్నమయ్య. నునుసిగ్గుల పెండ్లి కూతురు వర్ణన అపూర్వం, స్వాభావికం!

"పిడికిటి తలంబ్రాల పెండ్లికూతురు కొంత
పెడమరలి నవ్వీని పెండ్లికూతురు
పేరుగల జవరాలే పెండ్లికూతురు పెద్ద
పేరుల ముత్యాల మెడ పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు విభు
పేరు కుచ్చ సిగ్గు పడీ పెండ్లికూతురు
బిరుదు పెండెము వెట్టె పెండ్లికూతురు నెర
బిరుదు మగని కంటె పెండ్లికూతురు"

ఇలా పాట మొత్తం పూర్తయ్యేసరికి తెలుగువారింట పెండ్లి తంతు వీక్షించినట్లవుతుంది. 'పెద్ద తురుమువెట్టి పెండ్లికూతురు' అన్నప్పుడు గోదాదేవి గుర్తుకు రాక మానదు. 'పెట్టెడు చీరలు కట్టీ పెండ్లికూతురు' అన్నప్పుడు మాటిమాటికీ కొత్త చీరలు మార్చుకునే తెలుగువారింటి పెండ్లి కూతురు గుర్తుకు వస్తుంది. ఎంత దేవేరి అయినా వివాహ సమయంలో విభుని చెంత చేరినప్పుడు నునుసిగ్గులు విరులై కురిశాయి. ఆ వైనాన్ని బహుసుందరంగా వర్ణించాడు భావుకుడైన అన్నమయ్య. అమ్మవారితో కూడిన అయ్యవారిదే వైభోగం! అది అన్నమయ్యకే ప్రత్యక్షం!

"చిన్ని శిశువు చిన్ని శిశువూ యెన్నడు
చూడమమ్మ యిటువంటి శిశువూ" – అంటూ భావాంబర వీధులలో చరించి ఆ శ్రీకృష్ణుడి బాల్యక్రీడలను భక్తిమీర వర్ణించాడు అన్నమయ్య.



తోయంపు కురులతోడ తూగేటి శిరసు
చింతకాయల వంటి జడలగములతోడ

ఇంకా–

బలుపైన పొట్ట మీది పాల చారల తోడ
నులివేడి వెన్న దిన్న నోరితోడ – ఉన్నాడు ఆ శిశువు. ఇది పద కవితా పితామహుని సహజ కవితాసౌందర్యం.

'గొల్లెతలు చల్లలు గొనకొని చిలుకగ
వెల్లవిరి యాయెత విష్ణు కథ' అన్నాడు.

విరుద్ధ భావాల సంఘర్షణ లాగా కనిపిస్తుంది ఈ అభివ్యక్తి. చల్ల చిలికితే వచ్చేది వెన్న. అన్నమయ్యకు వెల్లడి అయింది విష్ణుకథానవనీతం! గొల్లెతలు సామాన్యులు కారు, విష్ణుభక్తాగ్రేసరులు. బ్రహ్మాదిదేవతలు, సనకసనందాదులు, వేదవిద్యా పారంగతులు నారదాది మునులు విష్ణుకథను విదితం చేయడం ఒక ఎత్తు. ముగ్ధగోపకాంతలు చల్లలు చిలుకగ వెల్లడి కావడం ఒక ఎత్తు. విష్ణుకథ సృష్టి కర్తకంటె ప్రాచీనం, వేదవేత్తలకే దుర్లభం. అటువంటిది గొల్లెతలకు మాత్రం అత్యంత సమీపం, నవనీత సదృశం. పూజాది విధులు కూడ తెలియవు వారికి అయినా నిత్యకృత్యమైన చల్లచిలకడంలో వెల్లడి అయినది విష్ణుకథ. ఎందుచేతనంటే వారికి శ్రీకృష్ణుని పైగల ప్రేమ అంతగాఢమైంది కనుక. విశ్వాసం ఎక్కడ ఉంటే అక్కడ భగవంతుడుంటాడు. యజ్ఞయాగాదులు, కర్మక్రతువులకంటె మనసు ముఖ్యం. అది చెప్పడమే అన్నమయ్య ధ్యేయం! వెన్నవలె మృదుమధురమైన విష్ణుకథను నవనీత సదృశమైన రీతిలో వెల్లడి చేశాడు ఇక్కడ.

ఆ వేంకటేశ్వరుని మేలు కొలపడం, నిదురపుచ్చడం అన్నమయ్య భావుకతకు ఆలంబనాలై ఎన్నెన్నో మధురసంకీర్తనలకు మూలకారణాలయ్యాయి.

"విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవలె"

స్వామికి చెప్పాల్సిన వింతలెన్నో ఉన్నాయని మనసు వేగిరపడుతుంది. ఆపరమాత్మ సామాన్యమానవుడిలాగా నిదురపోతాడా, ఆమాటకువస్తే ఆయనకు తెలియని విశేషాలు ఉంటాయా అని తర్కానికి దిగితే భావుకత ఎగిరిపోతుంది. కవిత్వం హృదయసంబంధివ్యాపారం కదా!

బ్రహ్మాదులు వచ్చి వేచి ఉన్నారు స్వామీ నిదురలెమ్మని చెప్పడం చాల పదాలలో కనిపిస్తుంది. ఇక్కడ 'పన్నగపు దోమతెర పైకెత్తవలె' అనడం విశేషం. పన్నగం స్వామికి శయ్య అవుతుంది కాని ఇక్కడ దోమతెర అయింది. అంటే స్వామి పరుండినాక ఆ పన్నగం ఆయన చుట్టూ తెరలాగా కూడ ఆవరించి ఉన్నట్లు అన్నమయ్య ఊహించాడు. పడగలమయమైన శయ్యకు పన్నగపు దోమతెర ఉండడం సహజమే కదా. భావనకు హద్దులుండవు. తర్కం చాలదు!

వలపు తీవ్రతను రకరకాలుగ వర్ణించారు కవులు. అన్నమయ్య కూడ వర్ణించాడు. అయితే ఆ పద్ధతేవేరు. తాను పరిపరివిధాలుగ భావించి, భావనలో పలుమార్లు అనుభవించి చెప్పడం వలన అన్నమయ్య అభివ్యక్తి విలక్షణంగానే కాదు విశిష్టంగ కూడా ఉంటుంది. ఒక గోపిక శ్రీకృష్ణుని చేరడానికి వేగిరపడుతుంటుంది. ఆమె మనోభావాలను అన్నమయ్య వర్ణించిన పద్ధతి విచిత్రంగా ఉంది.

"తామసించి యుండలేక తల్లడించగాను
చీమలు మై ప్రాకినట్లు చిమ్మరేగెవలపు".

ఒళ్ళంతా చీమలు పాకితే తిక్కరేగుతుంది. స్థిమితంగ ఉండడం ఎట్టివారికైనా సాధ్యంకాదు. అటునిటు కదులుతు చిడిముడి పడతారు. వలపు చిమ్మరేగిన గోపవనిత ఉల్లం కూడ ఒళ్ళంతా చీమలు పాకినప్పటివలె స్థిమితంగ ఉండలేని స్థితికి చేరింది. అందుచేతనే ఇంటిని విడిచిపెట్టి ఇలవేల్పును చేరుకొంది. ఇతఃపూర్వం ఎవరు వర్ణించని విధంగ స్వతంత్రంగ వర్ణించాడు అన్నమయ్య. చీమ ఒకటి కుడితేనే స్థిమితం కోల్పోతాం. చీమలుమై పాకినట్లు చిమ్మరేగిన వలపు స్థిమితంగ ఉండనిస్తుందా!

స్వతంత్రభావుకత అన్నమయ్య కవిత్వ సహజ లక్షణం. శ్రీ వేంకటాధీశుని భక్తుడు, చెలిమికాడు అయిన అన్నమయ్య అనవరతం ఆ స్వామిని గురించే ఆలోచిస్తాడు. అరమరికలు లేకుండ ఆడతాడు, పాడతాడు. ఆ దైవాన్ని శిశువుగ భావించి, సహజంగ వర్ణించి మురిసిపోతాడు. ఆ పాలదొంగని పరిపరి విధాలుగ వర్ణిస్తాడు. ఎంత వర్ణించినా తనివి తీరదు!

"నోరు నిండా జొల్లుగార నూగి ధూళిమేనితో
పారేటి బిడ్డని వద్ద బాడేరు
ముద్దులు మోమున గారమూల మూలలదాగే
బుద్ధుల బాలుని వద్ద బాడేరు"

ఎంత స్వాభావికంగ పారాడే బిడ్డని వర్ణించాడు! బ్రహ్మాదులు, సనకసనందాదులు



వచ్చి శిశువుగా నున్న శ్రీకృష్ణుని స్తుతిస్తున్నారు. ఈ బాలుడేమో అచ్చంగ గొల్లపిల్లవాడి వలె ఉన్నాడు. దైవత్వం కాదుగదా రాచరికపు లక్షణాలైనా మచ్చుకు కూడ లేవు. అయినా గానం చేస్తున్నారు నారదాదిమునులు. మూలమూలల దాగే బుద్ధులబాలుడు అనగానే కొత్తవారిని చూచి బిడియంతో మూలమూలలలో దాగే శిశువు కనిపిస్తాడు. తల్లిచీర చెంగులలో ముఖం దాచుకొనే శిశువు! భావించే కొలదీ బహుభంగుల దాగి ఉండే భగవంతుడు సాక్షాత్కరిస్తాడు. సరిగా వెదకి పట్టుకోకపోతే దొరకని శిశువులాగ ఏకాగ్రతతో ఆరాధించక పోతే భగవంతుడు దొరకడు! చివరగ మనుషుల మౌఢ్యాన్ని అన్నమయ్య వర్ణించిన విధాన్ని చూద్దాం.

"కడలుడిపి నీరాడగా తలచువారలకు
కడలేని మనసుకు కడమ ఎక్కడిది?
ముంద తెరిగిన వెనుక మొదలు మరి చెదనన్న
ముంద తే మెఱుగు తా మొదలేల మఱచు
దాహ మణగిన వెనుక తత్వమెఱిగెదనన్న
దాహమే మణగు తా తత్వమేమెఱుగు" – మాయలోపడి పరతత్వాన్ని గ్రహించలేనివారలను తలచుకొని అన్నమయ్య చెందిన నిర్వేదం ఇది.

అన్నమయ్య పదాలలో భావుకత పరిపూర్ణంగ, సులభ గ్రాహ్యంగ ఉంటుంది. భావించే కొలది చవులూరిస్తుంది. తోడే కొద్దీ నీరు ఊరే మంచి నీటి చెలమ అన్నమయ్య పదసాహిత్యం! శ్రవణ సుభగంగ, విశిష్టార్థగమ్యంగ సంగీత సాహిత్యాల మేలు కలయికగ భాసిస్తుంది. విష్ణువు సర్వవ్యాపి! అన్నమయ్య పదాలలో వినిపించే విష్ణుకథ స్వతంత్ర భావుకతతో కూడి ఉంటుంది. అందుచేతనే అది మనసును ఆకట్టుకొంటుంది. మళ్ళీ మళ్ళీ మననం చేసికోవాలనిపించే ఒక వైశిష్ట్యం అన్నమయ్య కవిత్వంలో నిండి ఉంటుంది. దానిని వెదకి పట్టుకోగలిగితే మనసంతా ఆనంద పారవశ్యంతో నిండిపోతుంది. భావించే వారి శక్తి కొద్దీ, అనురక్తి కొద్దీ అన్నమయ్య కవిత్వం అర్థమవుతుంది. అందులోని భావం బోధపడుతుంది.

*వివేచన, సంచిక 25, 26*

**తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం**

***జనవరి 2006***

# కడలేని అమృతంపు నడబావి - మనుచరిత్ర

మనుచరిత్ర తొలితెలుగు ప్రబంధం. 16వ శతాబ్దంలో వచ్చిన ప్రబంధ పరంపరలో ఇది మొట్టమొదటిది కావడమే కాదు అద్వితీయమైంది కూడా. దీనిని రచించిన వాడు అల్లసాని పెద్దన. పెద్దనకు ఆంధ్రకవితాపితామహుడనే బిరుదు ఉంది. అది అన్ని విధాలా సార్థకమైన బిరుదు. ఆంధ్ర సాహిత్య చరిత్రలోనే అపూర్వమైంది 16వ శతాబ్దం. అదే శ్రీకృష్ణదేవరాయల యుగం. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా మనుచరిత్రను రచించుమని పెద్దనను అర్థించినాడు. పెద్దన అష్టదిగ్గజ కవులలో అగ్రేసరుడు.

"సప్త సంతానములలో ప్రశస్తి గాంచి
ఖిలము గాకుండునది ధాత్రి గృతియకాన
కృతిరచింపుము మాకు శిరీష కుసుమ
పేశల సుధామయోక్తుల బెద్దనార్య!

హితుడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుడ వాంధ్ర కవితా
పితా మహుడ వెవ్వరీడు పేర్కొన నీకున్?

మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రస సమంచిత కథలన్
విన నింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతుర రచన కనుకూలంబున్"

పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు - వీరిని గురించి కొన్ని ఐతిహ్యాలున్నాయి. ఒకప్పుడు శ్రీకృష్ణదేవరాయలు భువన విజయ సభాస్థలిలో సంస్కృతాంధ్రములలో సమానముగా కవిత్వం చెప్పగలిగిన వారికి గండపెండేరం బహూకరిస్తానని ప్రకటించాడట. ఎవరూ మాట్లాడలేదట. అప్పుడు రాయలిలా అన్నాడట.



"ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరు గోరగలేరు లేరొకో..."

అని సగం పద్యం చదవగానే పెద్దన లేచి

"పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీవెఱుంగవే
పెద్దన కీదలంచినను బేరిమి నాకిదు కృష్ణరాణ్ణృపా"

అని పూరించాడట. అంతటితో ఆగకుండా సంస్కృతాంధ్ర కవితా రీతులను ఆశువుగా చెప్పాడట.

"పూత మెఱుంగులుం బసరుపూప బెడంగులు జూపునట్టివా
కైతలు జగ్గు నిగ్గు నెనగావలె గమ్మన గమ్మన న్వలెన్
రాతిరియుం బవల్ మఱపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దా తరితీపులంబలెను దారనిలన్వలె లోదలంచినన్
బాతికగైకొనన్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసుకోర్కెలు రావలె నాలకించినన్
జేతికొలంది గోగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్నిమే
ల్మూతల చన్నుదోయివలె ముచ్చటగావలె బట్టి జూచినన్
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవిగావలె బంటనూదినన్
గాతల దమ్మిచూలి దొరకైవసపుం జవరాలి సిబ్బెపు
న్మే తెలి యబ్బురంపు జిగి నిబ్బరపు బ్బగు గుబ్బగుబ్బ పొం
బూతల నూనెకాయ సరిపోడిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నబంతి బయకారపు గన్నడగౌళ పంతుకా
సాతత తాన తానల పసందివుటాడెదు గోటమీటుబల్
మ్రోతలునుంబలెన్ హరువుమొల్లము గావలె నచ్చతెన్గులీ
రీతిగ, సంస్కృతంబు పచరించిన పట్టున భారతీవధూ
టీ తపనీయ గర్భనికటీ భవదానన పర్వ సాహితీ
భౌతిక నాటక ప్రకర భారత భారత సమ్మత ప్రభా
శీతనగాత్మ జాగిరిశశేఖర శీతమయూఖ రేఖికా
పాతసుధా ప్రపూర బహుభంగ ఘుమంఘుమఘుంఘు మార్భటీ

జాతక తాళయుగ్మలయ సంగతి చుంచువిపంచి కామ్రుదం
గాతత తేహితత్త హిత హాధిత దందఱ ధాఱ దింధిమి
వ్రాతనయానుకూల పదవార కుహూద్యహహారికింకిణీ

నూతనఘల్లలాచరణ నూపుర ఝూళఝుళీ మరంద సం
ఘాత వియద్ధునీ చకచక ద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమార గంధవహహారి సుగంధ విలాస యుక్తమై
చేతము చల్లజేయవలె జిల్లున జల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీ ఫల మధు ద్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరస ప్రసార రుచిరప్రసరంబుగ సారె సారెకున్."

అప్పుడు శ్రీకృష్ణరాయలు పెద్దన కాలికి స్వయంగా గండ పెండేరాన్ని తొడిగాడట. ఇది ఆంధ్రసాహిత్య చరిత్రలో ఒక అపూర్వ సన్నివేశం. పై ఆశు కవితలో రాయలనాటి రసికత కూడా ద్యోతకమౌతుంది. మరో సందర్భంలో

"నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడెమాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకిన గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే"

అని కూడా పెద్దన చెప్పినాడని ప్రతీతి. ఇక్కడ కూడా రాయల యుగంలో కవుల అభిరుచు లెట్లుండినాయో తెలుస్తుంది. మొత్తం మీద కవిత్వంలో పారమార్థిక దృష్టి తగ్గి లౌకిక దృష్టి పెరిగింది అని చెప్పవచ్చు.

పెద్దన రాయలుకు బాల్యంలో గురువు అనే అభిప్రాయాన్ని ఈ కవితలు బలపరుస్తాయి. రాయల మరణం తర్వాత పెద్దన దుఃఖించిన తీరు కూడా వారిరువురి అనుబంధాన్ని ధ్రువపరుస్తుంది.

"ఎదురైనచో దనమద కరీంద్రము నిల్పి కేలూత యొసగి యెక్కించుకొనియె
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు లడిగిన సీమలయందు నిచ్చె
మనుచరిత్రం బందు కొనువేళ బురమేగ పల్లకి దనకేల బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమునకీవె తగుదని తానెపాదమున దొడిగె
ఆంధ్ర కవితాపితామహ అల్లసాని పెద్దన కవీంద్రయని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబనగుచు."



శ్రీకృష్ణదేవరాయల యుగం ఆంధ్ర సరస్వతికి స్వర్ణయుగం. ఆ కాలంలో వచ్చిన ప్రబంధాలన్నీ దేనికదే విశిష్టమైందనిపిస్తుంది. అయితే వాటికన్నిటికీ మార్గదర్శకత్వం వహించింది మాత్రం మనుచరిత్రే.

మనుచరిత్రకు ముందున్న గ్రంథాలన్నీ సంస్కృతానువాదాలే. పురాణేతి హాసాలు ముందు వచ్చాయి. తరువాత కావ్యాను వాదానికి శ్రీకారం చుట్టాడు శ్రీనాథుడు. కవిత్రయ భారతంలో శృంగార నైషధంలో పోతన భాగవతంలో ప్రబంధాలకు పనికి వచ్చే ముడి సరుకులున్నాయి. వాటిని పూర్తిగా ఉపయోగించుకొంటూనే కథలో కూడా కొత్తదనాన్ని సంతరించాడు పెద్దన. మార్కండేయ పురాణాంతర్గతమైన చిన్న కథను తీసుకొని ఆరు ఆశ్వాసాల ప్రబంధంగా మలిచాడు. సంస్కృత మహాకావ్యాలకు దీటుగా తెలుగులో వచ్చిన స్వతంత్ర రచనలనే మనం ప్రబంధాలంటున్నాం. ముఖ్యంగా 16వ శతాబ్దంలో పెద్దన మొదలుకొని రచనలు చేసిన కవుల గ్రంథాలకే వర్తిస్తున్న మాట ఇది.

ప్రబంధాలంటే ప్రకృష్టమైన బంధం కల కావ్యాలని అర్థం. అష్టాదశ వర్ణనలతో అలంకార బాహుళ్యంతో కవి ప్రతిభా పాండిత్యాలకు దర్పణాలుగా నిలిచేవే ప్రబంధాలు. ప్రౌఢ కావ్యశిల్పంతో అలరారే ప్రబంధాలలో రచనా చమత్కారానికుండే ప్రాధాన్యం చాలా ఎక్కువ. "భవచ్చతుర రచన కనుకూల" మని రాయలు అనడంలో అంతరార్థమిదే. శబ్ద సౌష్టవానికి ప్రాముఖ్యం పెరిగింది. ఒకరిని మించి మరొకరు వర్ణనలు చేయడం మొదలుపెట్టారు. క్రమంగా రసప్రాధాన్యం తరిగింది ప్రబంధాలలో.

తొలి ప్రబంధమైన మనుచరిత్రలో మాత్రం అర్థపుష్టి కొరవడ లేదనే చెప్పాలి. మనుచరిత్రగా ప్రసిద్ధిపొందిన ఈ గ్రంథానికి పెద్దన పెట్టిన పేరు "స్వారోచిషమను సంభవము". కథను బట్టి చూస్తే ఇదే సరైన పేరు. కాని పెద్దన కాలం నాటికే మనుచరిత్ర అనడం పరిపాటి అయిందని తెలుస్తుంది. దీనిలో ఉన్న కథ మనువు పుట్టుకకు దారితీసిన వృత్తాంత కథనమే కాని మనువు చరిత్ర కాదు. మనువు పుట్టుకతో కావ్యం ముగుస్తుంది. అయినా దీనికి మనుచరిత్ర అనే పేరే స్థిరపడిపోయింది. ఇది మార్కండేయ పురాణాంతర్గతమైన కథ. స్వాయంభువుడి తర్వాత వాడైన స్వారోచిషమనువు పధ్నాలుగు మనువులలో రెండవవాడు. స్వారోచిషమనువు కథ సంస్కృత మార్కండేయ పురాణంలో ఆరు అధ్యాయాలలో రెండువందల నలభై తొమ్మిది శ్లోకాలలో చెప్పబడింది. మారన దానిని తన తెలుగు మార్కండేయ పురాణంలో నూట ఏభై ఒక్క గద్యపద్యాలలో రచించాడు. పెద్దన మార్కండేయ పురాణాంతర్గతమైన ఆ కథను తీసుకొని ఆరు ఆశ్వాసాలలో ఆరువందల అరువది రెండు గద్య పద్యాలలో

స్వతంత్ర గ్రంథంగా రచించాడు. ప్రధానమైన కథలో ఎక్కువ మార్పులు చేయకుండా రసోదంచితమైన భాగాలను పెంచి సమయోచితమైన సంభాషణలను కూర్చి సందర్భోచితములైన వర్ణనలను, అలంకారాలను చేర్చి మనోహరమైన కావ్యంగా మలిచాడు అల్లసాని పెద్దన. తదనంతర ప్రబంధ కవులందరూ ఇదే మార్గాన్ని అనుసరించారు. చిన్న మొక్కను తీసుకొని ఫలపుష్పభరితమైన మహావృక్షంగా తీర్చిదిద్దాడు పెద్దన.

## కథాసంగ్రహం

ఆర్యావర్తదేశంలో వరుణానదీ తీరంలో అరుణాస్పదమనే పేరుగల పట్టణం ఒకటి ఉండేది. దీనిలో ప్రవరుడు అనే పేరుగల విప్రవరుడు ఉండేవాడు. అతడు పరమ నిష్ఠాగరిష్ఠుడు, వేదవేదాంగాలను ఎరిగినవాడు, వేదాధ్యయన, అధ్యాపన తత్పరుడు, మనోహరమైన రూపము కలవాడు, భోగదూరుడు.

"వాని చక్కదనము వైరాగ్యమున జేసి
కాంక్ష చేయు వారకామినులకు
భోగ బాహ్యమయ్యె బూచిన సంపెంగ
పొలుపు మధు కరాంగనలకు బోలె"

ఎంత సౌందర్యవంతుడో అంత జితేంద్రియుడన్నమాట. అతడు అనుకూలవతియైన భార్యతో, తల్లిదండ్రులతో. శిష్యులతో, అతిథి అభ్యాగతులకు తగిన విధంగా సేవలు చేస్తూ జీవించేవాడు. ఇట్లుండగా ఒకనాడు ఒక సిద్ధుడు ప్రవరుని ఇంటికి వచ్చాడు. సిద్ధునికి తగిన మర్యాదలు చేసి ప్రవరుడు అతడు చూచిన ప్రదేశాలు, విశేషాలు చెప్పుమని అడిగాడు. "పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ" ని ప్రవరుడి అభిప్రాయం.

ఏయే దేశములన్ జరించితిరి మీరేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళి ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటుల గల్గు వింతలు మహాత్మా నాకెఱింగింపరే

ప్రవరుడికి సిద్ధుడు తాను చూచిన ప్రదేశాలను గూర్చి చెప్పాడు. వయసులో చిన్నవాడే అయిన ఆ సిద్ధుడు అన్ని ప్రదేశాలనెలా చూడగలిగాడని ప్రవరుడడిగాడు. ఈశ్వరుని దయ వలన తనకు పాదలేపనం అనే దివ్యౌషధం లభించిందని చెప్పాడు



సిద్ధుడు. దాని సహాయంతో మనోవాయు వేగాలకంటె ఎక్కువ వేగంతో తాను కోరుకున్న చోటుకు వెళ్ళగలనన్నాడు. ప్రవరుడు తీర్థయాత్రలు చేయాలనే తన కోరికను బయటపెట్టి ఆ సిద్ధుని వేడుకున్నాడు. సిద్ధుడు ప్రవరుని పాదములకు ఒక పసరుపూసి వెళ్ళిపోయాడు. దాని సహాయంతో ప్రవరుడు హిమాలయాలకు వెళ్ళాడు.

"అట జని కాంచె భూమిసురుడంబర చుంబి శిరస్సర జ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగతరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిపుల్ల కలాపకలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్"

ఆ హిమాలయ పర్వతం మీద మధ్యాహ్నం వరకు ఎన్నెన్నో వింతలు చూచిన ప్రవరుడు ఇంటికి వెళ్దామనుకునే సరికి మంచు వలన పాదలేపనం కరిగిపోయింది. ఎవరినైనా అడిగి దారి తెలుసుకుందామనుకుంటాడు. అతడలా తిరుగుతుండగా ఒక భవనంలో వీణవాయించుచున్న వరూధిని కనిపించింది. ఆమె అప్సరాంగన. ప్రవరుని చూడగానే మోహపరవశురాలైంది. ఆమె కూడా అపురూప సౌందర్యవతి. ప్రవరుడామెను ఇల్లుచేరే మార్గం చెప్పమని అడిగాడు.

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటి జరించెదోట లే
కివ్వన భూమి భూసురుడ నే బ్రవరాఖ్యుడ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబు జేర నిం
కెవ్విధి గాంతు దెల్పగదవే తెరువెద్ది శుభంబు నీకగున్."

వరూధిని ప్రవరుని చూచి వీనిని పరిగ్రహించని జన్మ వృథా అని తలపోసింది. అందుకే-

"ఇంతలు కన్నులుండ దెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర! యే
కాంతము నందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబు లేకడుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్"

అని నర్మగర్భంగా మాట్లాడింది. ప్రవరుడు పదేపదే ఇల్లు చేరే మార్గం చెప్పమని అర్థించాడు. ఆమె తన కోరికను బయటపెట్టి పట్టలేని మోహంతో కౌగిలించుకుంది. ప్రవరుడు "హా శ్రీహరీ" అంటూ ఆమెను తోసివేశాడు. ఆమె నఖక్షతమైన వక్షాన్ని చూపించి కలస్వనంతో ఏడ్చింది. ప్రవరుడిని సుముఖం చేసుకోవడానికి వరూధిని శృంగార శాస్త్రాన్ని వల్లవేసింది. అయినా అతడు లొంగలేదు. వారిరువురి

వాదోపవాదాలు ముగిశాయి. ప్రవరుడు తానుపాసించే అగ్నిదేవుని ప్రార్థించి ఎట్టకేలకు ఇల్లుజేరాడు. ప్రవరుడు వెళ్ళిపోయిన తర్వాత వరూధిని మదనతాపంలో పడింది. చంద్రుడిని, మన్మథుని, మలయ పవనాన్ని ఉపాలంభించింది. అంతకు ముందొకప్పుడు ఆమెచే తిరస్కృతుడైన గంధర్వుడొకడు ఇదంతా గమనించాడు. శాంబరీ మహిమ చేత ప్రవరుడి రూపాన్ని పొందాడు. ఆమెకు కనిపించేటట్లు తిరిగాడు. ఆమె అతనిని మళ్ళీ అర్థించింది. ఆమె మీద జాలితో ఒప్పుకుంటున్నట్లు నటించి, కవయు సమయంలో కళ్ళు మూసుకోవాలని, తన అభీష్టం నెరవేరినా తాను వెళ్ళేవరకు తనను వదిలిపెట్టి ఆమె వెళ్ళకూడదని నియమాలు పెట్టి ఆమెతో సుఖించాడు. కొంతకాలానికి ఆమె గర్భవతి అయ్యింది. తన వంచన బయటపడితే ఆమె శపిస్తుందని భయపడిన గంధర్వుడు ఆమెకు మరల వస్తానని చెప్పి ఒప్పించి వెళ్ళిపోయాడు.

వరూధిని తొమ్మిది నెలలు నిండిన తర్వాత ఒక కొడుకుని కన్నది. మునులు అతడికి స్వరోచి అని పేరు పెట్టారు. సకల విద్యలను ఉపదేశించారు. స్వరోచి పెద్దవాడై మందరగిరి మీద విశ్వకర్మ నిర్మించిన నగరంలో ఆటవికులు సేవిస్తుండగా రాజ్యమేలసాగాడు. ఒకరోజు మృగయా వినోదం పొందగోరి కైలాస పర్వతప్రాంత అరణ్యాలలో వేటాడి కొంతసేపటికి ఒకచోట విశ్రమించాడు. ఆ సమయంలో ఒక స్త్రీ ఆర్తనాదాలు వినిపించాయి. ఆ తరువాత భయశోక విహ్వలయైన ఒక యువతి కనిపించింది. ఆమె ఇందీవరాక్షుడనే గంధర్వుడికి, మరుదశ్వని కూతురుకి పుట్టినదానని పరిచయం చేసుకున్నది. తనను మూడురోజుల నుండి ఒక భయంకరాకారుడైన రాక్షసుడు తరుముకుంటూ వస్తున్నాడని రక్షింపమని వేడుకున్నది. పేరు మనోరమ అని చెప్పింది. పారర్షి కూతురు కళావతి, మందార, విద్యాధరుల కూతురు విభావసి ఆమె ప్రాణసఖులు. వాళ్ళు ముగ్గురు ఒకసారి కైలాసపర్వతం మీద పూలు కోసుకుంటూ ఒక గుహలో ఒళ్ళంతా రోమాలతో నిండిన ఒక ముసలి మునిని చూచారు. బాల్య చాపల్యంతో మనోరమ అతడి ముఖం పట్టుకున్నది. రాక్షసుడి బారిన పడతావని ముని శపించాడు. సఖులు ఆ మునిని నిందించారు. వారు క్షయ రోగగ్రస్తులవుతారని శపించాడు. మనోరమ అస్త్ర హృదయం అనే విద్యను స్వరోచి కిచ్చింది. అది ఈశ్వరుని నుండి స్వాయంభువ మనువు, అతని నుండి వసిష్ఠుడు, అతని నుండి మనోరమ మాతామహుడైన చిత్రాశ్వుడు పొందిన విద్య. చిత్రాశ్వుడు అల్లుడైన మనోరమ తండ్రికి, తండ్రి మనోరమకు ఆ విద్యను ప్రసాదించారు. మనోరమ ద్వారా స్వరోచికి సంక్రమించింది. దాని సహాయంతో రాక్షసుడిని ఎదిరించి ఆగ్నేయాస్త్రంతో నేలగూల్చాడు. ఆ రాక్షసుడి భయంకర రూపం పోయి గంధర్వుడు



ప్రత్యక్షమై స్వరోచిని కౌగిలించుకొన్నాడు. అతడే ఇందీవరాక్షుడు, మనోరమ తండ్రి. స్వరోచికి మేనమామయే. ముని శాపం వలన రాక్షసుడై కూతురిని తరమసాగాడు. అతడు నలనాభుడనే గంధర్వుని కుమారుడు. బ్రహ్మమిత్రుడనే ఋషి శిష్యులకు ఆయుర్వేదం బోధిస్తుంటే తనకు కూడా నేర్పమని అడిగాడు. ముని నిరాకరించాడు. ఇతడు ప్రచ్ఛన్నంగా ఆ విద్యనంతా గ్రహించాడు. పైగా మునిని "మదిన్ దీండ్రల్ గల్గిన వారికే కరణినేనిన్ విద్యరాకుండునే గుండ్రాడాచిన పెండ్లి యేమిటికి జిక్కుంగష్టముష్టింపచా" అని హేళన చేశాడు. ముని కోపించి రాక్షసుడివై కూతురినే మ్రింగుతావని శపించాడు. శరణువేడగా జాలిపడి ఒక ధన్యుని దివ్యశరాల బారిపడి శాపవిముక్తుడవుతావని అనుగ్రహించాడు. శాపవిమోచనాన్ని పొందిన ఇందీవరాక్షుడు తన కూమార్తె మనోరమను, ఆయుర్వేద విద్యను స్వరోచికిచ్చెను. స్వరోచి మనోరమను పెండ్లాడాడు. కేళీగృహంలో ఆమె చెంత చేరిన స్వరోచి ఆమె దుఃఖించడం చూచి కారణమడిగాడు. తన ప్రాణసఖులు క్షయరోగంతో బాధపడుతుంటే తానెలా సుఖించగలనని అన్నది. స్వరోచి తాను నేర్చిన ఆయుర్వేద విద్య నుపయోగించి వారిని ఆరోగ్యవంతులను చేసి మనోరమ అనుమతితో వారిని కూడా వివాహమాడాడు. విభావసి అతనికి మృగపక్షి జాతుల భాష తెలుసుకొనే విద్య నిచ్చింది. కళావతి పద్మినీ విద్యను ప్రసాదించింది. స్వరోచి తన ముగ్గురు భార్యలతో సుఖంగా జీవించసాగాడు. ఒకరోజు ఒక సరోవరతీరంలో ఒక హంస ఒక చక్రవాకితో స్వరోచి అదృష్టవంతుడని పొగిడింది. దానికి చక్రవాకి ఒప్పుకోలేదు. ఒక పురుషుడు ఒక స్త్రీతో మాత్రమే కూడి ఉండాలి అన్నది. స్వరోచి ఆ పక్షుల సంవాదం విని సిగ్గుపడ్డాడు. ఇంకొకసారి తనను చేరవచ్చిన ఆడలేళ్ళను అదిలిస్తూ ఒక లేడి నేను స్వరోచినా ఇంతమందితో క్రీడించడానికి అన్నది. స్వరోచి ఆ మాటలు కూడా విన్నాడు. స్వరోచికి విజయ, మేరునందన, విభావసులనే ముగ్గురు కుమారులు కలిగారు. పద్మినీ విద్యా ప్రభావంతో మూడు నగరాలను కల్పించి వారికిచ్చి పట్టం కట్టాడు.

ఒకనాడు వేటకు వెళ్ళిన స్వరోచి ఒక పందిని చంపబోయాడు. ఒక ఆడులేడి అడ్డు తగిలి తనను చంపమని కోరింది. స్వరోచి కారణమడిగితే అన్యకాంతాసక్తుడవైన నిన్ను కోరుటకంటె మరణమే మేలన్నది. నీవు లేడివి-నేను మనిషిని - మన సంగమ మెట్లు సంభవం అని స్వరోచి అడిగాడు. నీవు ప్రేమతో నన్ను కౌగిలించుకుంటే అదే చాలు అని హరిణాంగన పలికింది. దయార్ద్ర హృదయుడైన స్వరోచి ఆలింగనంలో ఆ లేడి వనదేవతగా మారింది. దేవతలు సకల భూభవనరక్షాదక్షుడైన మనువును స్వరోచి వనదేవతల వలన పొందగోరిన కారణం చేత వనదేవత అలా వచ్చింది. స్వరోచి

వలన గర్భవతియైన వనదేవత ఒక శుభముహుర్తంలో తేజోనిధి అయిన కొడుకును కన్నది. అతడు తేజోనిధి, సకల సద్గుణాల ప్రోవు. స్వారోచిషుడనే ఆ బాలుడు విష్ణువును గూర్చి తపమాచరించాడు. విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. అతడు విష్ణువును స్తుతించి భక్తితో దశావతారాలను వర్ణించాడు. విష్ణువు ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు. భవద్దాస్యసుఖం కావాలి, నాకు కైవల్యం ప్రసాదించమని కోరాడు స్వారోచిషుడు. నీకు సాలోక్యం తర్వాత ప్రసాదిస్తాను. ముందుగా ధర్మబుద్ధితో రెండవ మనువువై భూమిని పాలించమని ఆజ్ఞాపించి మనువుగా పట్టం గట్టి అదృశ్యమయ్యాడు. స్వారోచిషుడు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. అతని పరిపాలనా కాలంలో వర్షాలు సకాలంలో కురిశాయి. పంటలు బాగా పండాయి. ప్రజలు సంతానవంతులై భోగభాగ్యాలతో బ్రతికారు. అగ్నివలన, దొంగల వలన భయం లేదు. వ్యాధులు లేవు. పండ్లు, పాలు, సుగంధ ద్రవ్యాలు సమృద్ధిగా దొరికేవి. ఈతిబాధలు, అకాలమరణాలు లేవు. తామరతంపరగా సృష్టి అభివృద్ధి చెందింది.

ఇదీ మనుచరిత్రలో కథ. ఇందులో వస్వైక్యం లేని మాట నిజమే. కాని పెద్దన సంవిధాన చాతుర్యం వలన అద్యంతం ఆసక్తికరంగా సాగింది ఇతివృత్తం. ప్రవరుని వృత్తాంతం, వరూధినీ ప్రవరుల వృత్తాంతం, వరూధినీ మాయా ప్రవరుల వృత్తాంతం, స్వరోచి వృత్తాంతం, మనోరమ వృత్తాంతం, ఇందీవరాక్షుని వృత్తాంతం, విభావసీ కళావతుల వృత్తాంతం, మృగీస్వరోచుల వృత్తాంతం, ఫలితంగా మనువు పుట్టుక–ఈవిధంగా సాగినకథలో ప్రతి సన్నివేశంలో ఏదో ఒక విధంగా ఒకదానితో ఒకటి అనుబంధానింపబడడం వలన కథలో విచ్ఛిత్తి ఏర్పడినట్లు అనిపించదు

## పాత్ర చిత్రణ

ప్రబంధ రచనలో కథనం, ఉక్తివైచిత్రి, పాత్రచిత్రణ, రసపోషణ, వర్ణనాలంకారాల కూర్పు ప్రధానాంశాలు. పెద్దన మనుచరిత్రలో పాత్ర చిత్రణ ప్రతిభావంతంగా చేశాడు. పాత్ర ప్రవేశంతో రూప స్వభావాలు అవగతం అయ్యేటట్లు పెద్దన చిత్రించాడు.ముఖ్యంగా వరూధినీ ప్రవరుల పాత్రలు తెలుగు సాహిత్యంలోనే మరపురాని పాత్రలుగా నిలిచాయి. ప్రవరుని వైరాగ్యం, వరూధినీ రాసిక్యం రెండు ప్రవాహాలు. ఒకదానినొకటి తాకిన రీతిలో వర్ణించబడ్డాయి. శాంతశృంగారాలకు మధ్య జరిగిన సంఘర్షణ ఇది. ప్రవరుడు పరకాంతా వైముఖ్యానికి ప్రతీకగా నిలిచిపోయాడు. తెలుగువారి గుండెలలో – శుకమహర్షిని మరపించాడు.



"ఆపురిబాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రు డంబురుహ గర్భకులాభరణంబనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుడలేఖ్యతనూ విలాసుడై"

వైరాగ్యం వలన వాని చక్కదనం జారకామినులకు భోగబాహ్యమైంది. అతని పితృభక్తి, అతిథి సేవాసక్తి, శిష్యానురక్తి, అనుష్ఠానశక్తి అనుపమానమైనవి. అతనికి అన్ని విధాలా తగిన ఇల్లాలు ఉంది. ఇంక కొరత ఏముంది?

"వండనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథు లేతేర నడికిరేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారి గాగ"

వరూధిని అప్సరాంగన, అద్భుత సౌందర్యరాశి. గానకళా కోవిద. ప్రవరుని రూపానికి ఆకర్షింపబడింది.

"ఎక్కడి వాడొ యక్షతన యేందు జయంత వసంతకంతులన్
చక్కదనంబునన్ గెలువజాలెడు వాడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ యేలని బంటుగా మరున్
దక్కగొనంగరాదె యకటా! నను వీడు పరిగ్రహించినన్"

అని తలపోసింది. ఆమెకు అతని గుణగణాలతో, స్వభావంతో పనిలేదు. అతడు తనను స్వీకరిస్తే చాలు అనుకుంది. తన వంటి అందగత్తెను, జవరాలిని కాదంటాడా అనుకున్నది.

"చిన్నివెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధి
బొడమిన చెలువ తోబుట్టు మాకు
రహి పుట్ట జంత్ర గాత్రముల ఆల్ గరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పనివెన్నతోడ బెట్టినది మాకు
హయమేధ రాజసూయముల నబ్బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకు
గనకనగసీమ గల్పవృక్షముల నీడ

బచ్చురాచెట్టుగమి రచ్చపట్టుమాకు
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాము గరిడీలు మాకు గోత్రామరేంద్ర!"

వరూధిని స్వభావం ఆమె మాటలలోనే సువ్యక్తమైంది. భోగకాంత కుచితమైన రీతిలో మాట్లాడింది. ప్రవరుడు యోగ మార్గానుయాయి. వరూధిని భోగ మార్గానుయాయి. వీరిరువురు ఎవరి మార్గాన్ని వారు సమర్థించుకున్నారు. ఎంత హొయలు కురిపించినా, ఎన్ని దృష్టాంతాలు చూపినా ప్రవరుడు వరూధిని మాటలకు లొంగలేదు. వీరిరువురి సంభాషణా చాతుర్యం అసదృశమైంది. పెద్దన ప్రతిభా గరిమ అంతా ఈ పాత్రలను చిత్రించడంలో, మాటలను కూర్చడంలో చూడవచ్చు. "ఎక్కడి యూరు కాల్నిలువ కింటికి బోయెదనంచు బల్కెదీవు, నిక్కము దాపనేల ధరణీసుర నందన యింక నీపయిన్ జిక్కె మనంబు నాకు" అని వరూధిని అంటుంది. ప్రవరుడామె చూపిన అరచేతిలో స్వర్గానికి ఆశపడడు. 'ఆనందో(బ్రహ్మ' అనే వేదవాక్యానికి ఆమె చెప్పిన వ్యాఖ్యానం విని సిగ్గు, వెగటు కలిగిన ప్రవరుడు "ఈ పాండిత్యము నీకు దక్క మఱియెందే గంటియే కామశాస్త్రోపాధ్యాయిని నావచించెదవు" అని సున్నితంగా మందలించాడు. "వనిత తనంత దావలచి వచ్చిన జుల్కన గాదె యేరికిన్" అని వగలు పోయింది. దాని కాతడు చలించడు. ఆమె చెప్పే సుఖాలను గురించి "చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై దేనియల్" అని తోసివేశాడు. ఆపుకోలేని తమకంతో వరూధిని మీద పడగా "హా శ్రీహరీ" అని నెట్టివేశాడు.

"పాటున కింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోకె గనుంగొను మంచు జూపి
యప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చె గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బ చనుమిట్టల నశ్రులు చిందువందగన్"

ఈ విధంగా భంగపడిన వరూధిని అంతటితో ఊరుకోక పరాశరుని విశ్వామిత్రుని, మాందకర్ణిని, దేవేంద్రుని వెలివేశారా, నీవు వారికంటె గొప్పవాడివా, "ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల దామరసనేత్ర లిండ్లబందాలుగారె" అని తర్కానికి దిగింది. తాపసులు అప్సరలను పొందడం కోసమే తపస్సులు చేస్తారని వరూధిని వాదించి విఫలమౌతుంది. ప్రవరుని నిష్ఠాగరిష్ఠతకు, వరూధిని సౌందర్య పిపాసకు జరిగిన సంఘర్షణను పెద్దన అద్భుతంగా వర్ణించాడు. ప్రవరుని పట్ల గౌరవం పెరుగుతుంది. వరూధిని పట్ల జాలి కలుగుతుంది.



ఆ తర్వాత మాయా ప్రవరునితో కూడి ఉన్నప్పుడు కూడ ఆమె మనసులో భావించుకొన్నది ప్రవరుని మహోన్నత మూర్తినే. మాయా ప్రవరుడిగా రూపుదాల్చిన గంధర్వుడు వరూధినిని కామించిన ఒక సామాన్య గంధర్వుడే కాని వాని నోట కూడ చివరికి పరకాంతా భోగేచ్ఛ దోషభూయిష్టమని పలికించాడు పెద్దన. మనువు కాదగినవాని మూల పురుషులు కావడం చేత వారిలో రాగం, భోగం, యోగం ముప్పేటగా ఉన్నట్లు పెద్దన సూచించాడు. వరూధిని కుమారుడైన స్వరోచి దక్షిణ నాయకుడు, భోగపిపాసి, అప్పుడు కూడా హంసీ, చక్రవాకుల చేత లేడి చేత వానిని హెచ్చరింపజేస్తాడు. ఇందీవరాక్షుడు విద్యాతృష్ణ కలవాడే అయినా దానిని అధర్మ మార్గంలో పొందజూస్తాడు. మనోరమ, కళావతి, విభావసి ఆయా విద్యలు తెలిసిన వారే కాని కొంచెం చాపల్యం కలిగిన వారు. ఇక వనదేవత దేవతల ప్రార్థన మీద వచ్చిన కార్యార్థి. మనువు పుట్టుక చేత దివ్యుడు, తపస్సు చేత ధార్మికుడు, భక్తిచేత దైవానుగ్రహపాత్రుడు కాబట్టి మనువు కాదగినవాడు.

## వర్ణనానైపుణ్యం

ప్రబంధాలలో ప్రత్యేకంగా చెప్పుకోవలసినవి వర్ణనలు. తత్పూర్వ కావ్యాలకు ప్రబంధాలకు ఉన్న అంతరం వర్ణనల వలననే ఎక్కువైంది అని చెప్పక తప్పదు. అష్టాదశ వర్ణనలను నన్నెచోడుడు పేర్కొన్నా ఆయన తరువాతి వారు అంతగా పట్టించుకోలేదు. సందర్భోచితాలనుకున్న వర్ణనలనే ప్రబంధ యుగపూర్వకవులు చేశారు. శ్రీనాథుడు నైషధంలో చేసిన వర్ణనలు చాలావరకు హర్షుని అనుసరణలే. స్వతంత్రంగా కావ్యరచన చేస్తూ అష్టాదశ వర్ణనలు కావించిన వాడు అల్లసాని పెద్దనయే. తదనంతర కవులందరికీ మనుచరిత్రయే మార్గదర్శకత్వం వహించింది. అయితే పెద్దన వర్ణనలు సందర్భోచితాలు, సురుచిరాలు కావడం చేత కథాగతికి అవరోధాలసిపించవు. రసపోషకాలే కాని భంజకాలు కావు. అరుణాస్పదపురాన్ని అమరపురి కన్నా గొప్పగా వర్ణించాడు పెద్దన. "అచటి విప్రులు మెచ్చరఖిల విద్యాప్రౌఢి ముదిమది దప్పిన మొదటి వేల్పు" అని ప్రారంభించి "అచ్చట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అని ప్రశంసించాడు. ఈ చిగురు కొమ్మ ప్రవరుడే!

ఇక హిమాలయాన్ని వర్ణించిన తీరు అద్భుతం. హిమవత్పర్వతం మీద ప్రవరుడు చూచిన ప్రదేశాలు ఎన్నెన్నో.

నిడుద పెన్నెఱి గుంపు జడగట్టిసగరుము
మ్మనుమందు తపము గైకొనినచోటు

జరఠకచ్ఛపకులేశ్వరు వెన్నుగానరా
జగతికి మిన్నేఱు దిగినచోటు
పుచ్చడీకతనంబు పోబెట్టి గిరికన్య
పతికొల్వ నాయాసపడిన చోటు
వలరాచరాచ వాడలి కాక్షు కనువెచ్చ
గరగిన యల కనికరపు చోటు

తపసి యిల్లాంద్ర చెలువంబు దలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు
కనుపపులు వేల్పుబడ వాలు గన్నచోటు
హర్షమున జూచి ప్రవరాఖ్యుడాత్మలోన

హిమవత్పర్వతాన్ని మంచుకొండగా భావించలేదు పెద్దన. వాసయోగ్యమైన పెనుకొండలాగా వర్ణించాడు. కవి ఆత్మీయత ఎక్కడో ఒక చోట కనిపించకుండ ఉండదు. వరూధిని విద్యుల్లతా విగ్రహ, శతపత్రేక్షణ, చంచరీక చికుర, చంద్రాస్య, చక్రస్తని, సతనాభి, మరున్నారీశిరోరత్నము. ప్రవరుడు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, భాషాపరశేషభోగి, వివిధాధ్వర నిర్మల ధర్మకర్మదీక్షా పరతంత్రుడు, అంబురుహ గర్భ కులాభరణుడు, అనారతా ధ్యాపన తత్పరుడు. అంతేకాదు యక్షతనయేందు జయంత వసంత కంతులన్ చక్కదనంబునన్ గెలువ జాలెడువాడు. ఈవిధంగా మనుచరిత్రలో ప్రతిపాత్ర స్వభావోచితంగా వర్ణించబడింది.

వస్తురూప సన్నివేశ వర్ణనలలో కూడా మనుచరిత్ర అగ్రగణ్యమే. దేనిని వర్ణించినా సంపూర్ణంగా మనోహరంగా అర్థవంతంగా వర్ణించడం పెద్దనకే చెల్లుతుంది. సామాన్యమైందిగా భావించే గృహస్థాశ్రమాన్ని పెద్దన వర్ణించిన విధం అపూర్వం, అసదృశం.

కెలకులనున్న తంగెటి జున్ను గృహమేధి
యజమానుడంక స్థితార్థ పేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యండు
దొడ్డిబెట్టిన వేల్పుగిడ్డికాపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమ ప్రప కులపతి



యాకటి కొదవు సన్యము కుటింబి
బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలి కాద్యనాథులకు గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె

ఇట్టి ఆశ్రమంలో అమితమైన తృప్తిని పొందుచున్నవాడు కాబట్టే ప్రవరునికి వరూధిని చూపించిన అమరసుఖాల ఆశకూడా లెక్కలేనిదైంది. అని పెద్దన సూచన. నిశ్చలంగా ఉండే వాటినే కాదు చకచ్చకితమైన వాటిని వర్ణించడంలో కూడా పెద్దన కుశలుడే. వరూధిని ప్రవరుని

"చూచి ఝుళం ఝుళత్కటక సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము లేనడుమల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్క పోకనునబోదియ జేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయపదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్"
నిలబడలేక సాగుచు ఆగుచు ఉన్న రీతి ఇది.

రాయలు కోరిన విధంగానే మార్కండేయోక్త ప్రకారంగా కథను గ్రహించాడు పెద్దన. కొన్ని మార్పులు చేర్పులు చేశాడు. ప్రబంధానికి వర్ణనలు ప్రధానం కాబట్టి మూలంలో లేని వర్ణనలను చేర్చాడు. హిమవత్పర్వత. సంధ్య, అంధకార, చంద్ర, చంద్రికా వర్ణనలు, చంద్ర మన్మథ మలయానిల ఉపాలంభాలు, పుష్పాపచయం, సంభోగం, మృగయావినోదం, యుద్ధం, మందర పర్వతం, పౌరకాంతలు, వివాహం, వసంతం, గర్భదోహదక్రియలు, దశావతార వర్ణనం ఇవన్నీ మనుచరిత్రలో చోటుచేసుకున్న అమూలక వర్ణనలే. పెద్దన ప్రతిభాపాండిత్యాలకు ఈ వర్ణనలు చక్కని తార్కాణాలు.

చతుర్థాశ్వాసంలో స్వరోచి వేట వర్ణనం అతి దీర్ఘంగా ఉంది. దాదాపు నలభై అయిదు పద్యగద్యాలలో నున్న వేట వర్ణన అత్యంత సహజంగా ఉంది. పెద్దన రాయలుతో ఎప్పుడైనా వేటకు వెళ్ళి ఉంటే తప్ప ఇంత కన్నులకు కట్టినట్లు వర్ణించగలిగేవాడు కాదు. ఇందీవరాక్షునితో యుద్ధం కూడా దీర్ఘంగానే ఉంది. ఈ రెండు కొంతవరకు కథకు అంతరాయాలే. ప్రబంధాలలో వర్ణనలకు ప్రత్యేక స్థానం కల్పించబడింది. తరువాత కవులు చాల సందర్భాలలో పెద్దనను అనుకరిస్తూనే మరింత ముందుకు

పోయి ఇంక దీర్ఘవర్ణనలు చేశారు.

సరస్వతీదేవిని స్తుతిస్తూ పెద్దన వ్రాసిన సీస పద్యం నడక చెప్పుకోదగింది. అయితే వాగ్దేవి వర్ణనలో సైతం సౌందర్య ప్రసక్తి చోటు చేసుకోవడం ఆనాటి యుగధర్మం అనుకొనిసరిపెట్టుకోవాలి.

చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే
సిందూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబునందున్న యెలదేటి
కించి దంచిత శ్రుతుల నీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడి
దుంబీఫలంబు తుందుడుకు చెంద
దరుణాం గుళిచ్ఛాయ దంతపు సరకట్టు
లింగిలీకపు వింత రంగులీన
నుపనిషత్తులు బోటులై యోలగింప
బుండరీకాసనమున కూర్చుండి మదికి
నించువేడుక వీణవాయించు చెలువ
నలువరాణి మదాత్మలో వెలయుగాత.

తృతీయాశ్వాసంలో పుష్పాపచయ వర్ణన ఒక రగడలో కూర్చబడింది. ఇది పెద్దన వైదుష్యానికి అద్దం పడుతుంది. మనుచరిత్రలో ఆలంకారికులు పేర్కొన్న అష్టాదశ వర్ణనలు కాక ఇంకా చాల ఉన్నవి. అయితే అవి అన్నీ చాలావరకు కథతో అనుసంధానం కలవే. నగర, సముద్ర, శైల, ఋతు, చంద్రోదయ, సూర్యోదయ, ఉద్యానవన, జలక్రీడ, శృంగార, విప్రలంభ, వివాహ, కుమారోదయ, మంత్ర, ద్యూత, ప్రయాణ, యుద్ధ, నాయకాభ్యుదయ, వేట, మున్యాశ్రమ, కన్యాంగ సౌందర్య, దౌహృద, సంధ్య, ధ్వాంత, రాజ, గ్రామ, నది, సరోవర, అరణ్య, అశ్వ, గజ, పుష్పాపచయ, వృక్ష ఆదిగాగల వర్ణనలు మనుచరిత్రలో ఉన్నవి. ఇందులో కొన్ని నాతి దీర్ఘవర్ణనలున్నవి.

## రసపోషణ

ప్రబంధ కవులు శృంగార రస ప్రాధాన్యం కల కథలనే చాలావరకు ఎంచుకున్నారు. అవసరం ఉన్నా లేకున్నా అతిమాత్రంగా శృంగార రసభావాలను వర్ణించారు. పెద్దన మనుచరిత్రలో శృంగారమే ఎల్లెడల విస్తరించి ఉంది. అయితే



ఇది ప్రవరుడు-వరూధిని, వరూధిని-మాయా ప్రవరుల మధ్య ఆభాసరూపంలో ఉంది. ఏకత్రైవానురాగం శృంగార రసాభాసం అని ఆలంకారికుల మతం. స్వరోచి -మనోరమ, విభావసి, కళావతుల నాశ్రయించి శృంగార రసం సర్వతోముఖంగా పోషింపబడింది. మృగీస్వరోచుల మధ్య ఆభాసరూపంలో ప్రారంభమై రస స్థాయి నందింది. తిర్యగ్జడ గతమైంది కూడా ఆభాసం.

మనుచరిత్రలో శృంగారం ఆభాసరూపంలో విప్రలంభ రూపంలో సంభోగరూపంలో కూడా ఉంది, శృంగార శాంత రసాలకు జరిగిన సంఘర్షణ నాన్యతో దర్శనీయం. ధర్మకామాలకు జరిగిన ఈ ఘర్షణలో ధర్మం గెలిచింది. అయితే వరూధినీ వారసుడు స్వరోచి, అతని కుమారుడు మనువు. అంటే వరూధిని వారసత్వమే మనువుకు సంక్రమించి ఉంటుంది. ఇంక ప్రవరుని ధార్మికత ప్రయోజనం ఈ కథలో ఏముంది అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఇక్కడ ఒక మనస్తత్వ శాస్త్ర సంబంధ విషయముంది. ఏమిటంటే వరూధిని కలిసింది గంధర్వునితోనే అయినా ఆమె మనసులో ముద్రితమైంది ప్రవరుని రూపమే. గంధర్వుడు కూడ ప్రవరుని రూపంలోనే ఆమెను కలుసుకున్నాడు. అతడు వంచనతో ఆమె దరిచేరినా చివరికి అతనితో కూడా పరివర్తన వచ్చిందని సూచించడానికి పెద్దన ప్రయత్నించాడు.

"ఎవ్వడు మీదెఱుంగక యథేచ్ఛసుఖైక రతిం జరింపగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధన హాని పుట్టు దా
నవ్వెడ నమ్మనుష్య పశువయ్యవివేకి చెడున్ జగంబున
న్నవ్వగబాలు రౌరవమునంబడ బాలును నిందపాలునై" (3-135)

విచ్చలవిడి శృంగారం పరిహార్యం అని ఇంత తీవ్రంగా చెప్పబడింది కూడ మనుచరిత్రలోనే అని ఆశ్చర్యం కలుగుతుంది. స్వరోచి విషయంలో కూడా ఒకచోట చక్రవాకి హంసితో చెప్తుంది. మరొకచోట లేడీ ఇతర లేళ్ళతో అంటుంది. స్వరోచి భోగాలాలసతను విమర్శించడమే. ఈ పక్షి మృగ సంభాషణలలోని అంతరార్థం. తాత్కాలికంగ వైరాగ్యాన్ని పొంది కూడ తిరిగి భోగాలలో మునిగి పోతాడు స్వరోచి. వనదేవత దైవ నిర్దేశం మేరకు ఉత్తమ సంతాన ప్రాప్తికై కోసం స్వరోచిని కోరుకుంటుంది. అప్పటికి స్వరోచిలో కూడా ఆత్మ విమర్శ, పరిణామశీలం బయలుదేరాయి. మనువు పుట్టుకకు తగిన భూమిక సిద్ధమైంది.

మనుచరిత్రలో రస భావ పరిపోషణకు తగిన సంఘటనలు సన్నివేశాలు సమృద్ధిగా ఉన్నాయి. ప్రధాన కథలో శృంగారం వివిధ భేదాలతో ప్రవరుని పరంగా

శాంతం, అవాంతర కథలలో మునుల క్రోధం, ఇందీవరాక్షుని రాక్షసరూపంలో భయానకం, రౌద్రం, స్వరోచి అతనితో చేసిన యుద్ధంలో వీరం, విద్యాధరుడు, పారర్షిని గొంతుకోసి చంపుటలో బీభత్సం, కళావతి తండ్రికోసం ఏడ్చుటలో కరుణం వర్ణింపబడ్డాయి. ఇవన్నీ ఇతివృత్తాన్ని ఆస్వాదయోగ్యంగా చేశాయి. సన్నివేశ నిష్టమైన స్థాయి, సంచారీ భావాలను పెద్దన మిక్కిలి నేర్పుతో వర్ణించాడు. వరూధిని పాత్రపరంగా శృంగార చేష్టలను వర్ణించడంలో ఒక ఔచిత్యం ఉంది. వరూధిని భోగకాంత, వావివరుసలు ఉచితానుచితాలు ఆమెకు లేవు. కేవలం ప్రవరుని రూపాన్ని చూచి కాంక్షించింది. తనతో స్వర్గసుఖాల ననుభవించమని కోరిందే కాని కలిసి ఎల్లప్పుడు జీవించమని అడగలేదు. ఇది ఆమె దృష్టిలో తప్పుకాదు. తనను ప్రవరుడు నిరాకరించినప్పుడైనా సిగ్గుపడి తొలగిపోకుండ అతని మీద పడుతుంది. స్వైర ప్రవృత్తికి వరూధిని పరాకాష్ట. ఇటువంటి పాత్రను చిత్రించడంలో పెద్దన కృతకృత్యుడయ్యాడు. ఇందుకు ఆమె చేష్టాగత వర్ణనమే దోహదపడింది. అదేవిధంగా వరూధిని కుమారుడైన స్వరోచిలో కూడా భోగలాలసత కనిపిస్తుంది. ఈ సందర్భానుగతమైన శృంగార వర్ణనలు కథకు ఆవశ్యకాలే కాని ఆటంకాలు కావు. సందర్భశుద్ధి లేని ఆనంతర ప్రబంధాల శృంగార వర్ణనలకు మనుచరిత్ర మార్గం చూపిందనడం పూర్తిగా సరికాదు. మితిమీరిన శృంగార వర్ణనలు ప్రబంధాలలోని ఇతర గుణాలను అథఃకరించాయి. కాని మనుచరిత్రలో కథాగతికి భంగం లేని పద్ధతిలో మాత్రమే వర్ణనాదులున్నాయి.

రసోదంచితమైన సర్వాంగ సుందరమైన మనుచరిత్ర పదికాలాల పాటు మనుచరిత్రయే.

## కవితా వైదుష్యం

మనుచరిత్ర మహాభారతం, నైషధం, భాగవతం తరువాత ఎన్నదగిన మహాకావ్యం. పెద్దన తనకు ముందున్న మహాకవుల రచనలను తరచి చూచినవాడు. తనదైన మార్గంలో రచన సాగిస్తూనే ముచ్చట గొలిపే ముందటి కవుల పద్యాలను అనుకరించాడు. ముఖ్యంగా శ్రీనాథుడి రచనారీతి పెద్దనను ప్రభావితం చేసింది. అయితే పెద్దన శీనాథుని పూర్వ కవిస్తుతిలో పేర్కొనలేదు. "నలినసంభవువాహనము వారువంబులు కులము సాములు మాకు కువలయాక్షి" అనే పద్యానికి "చిన్ని వెన్నెలకందు" అనే పద్యం అందమైన అనుకరణ. "కొసరి వసంతకాలమున" అనే కాశీఖండములోని వర్ణనకు పాటున కింతులోర్తురె" అనేది ప్రౌఢమైన అనుకరణ.



పైపద్యాల ప్రభావంతోనే "ఈసునబుట్టిడెందమున" అనే పద్యాన్ని ముక్కు తిమ్మన, "ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల" అనే పద్యాన్ని రామరాజభూషణుడు వ్రాశారనిపిస్తుంది. మనుచరిత్ర ప్రభావం వసుచరిత్ర మీద మరీ ఎక్కువనీ చెప్పవచ్చు. పాండిత్య ప్రకర్షలో శ్లేషవైచిత్రిలో, రచనా ప్రాగల్భ్యంలో అలంకార శిల్పంలో వసుచరిత్ర మనుచరిత్రను మించిపోయింది. కాని రసపుష్టిలో అర్థచమత్కృతిలో, పాత్ర చిత్రణలో, ఆర్ధ్రభావనల కూర్పులో మనుచరిత్ర అసదృశమైంది. అద్వితీయమైంది. మనుచరిత్ర రచనారీతి మిగతా ప్రబంధాలలో మరింత విస్తరిల్లి కనిపిస్తుంది. కాని ఆత్మకింపైన రసభావపుష్టిలో మనుచరిత్ర మనుచరిత్రయే, నాన్యతోసాధ్యం!

మనుచరిత్రలో పెద్దన లోకపరిశీలన, శాస్త్ర పాండిత్యం,సంస్కృత, ఆంధ్ర భాషలపై అధికారం స్పష్టంగా కనిపిస్తాయి. సంగీత శాస్త్ర పాండిత్యం పెద్దనకున్నదని అర్థమౌతుంది. చెలులు వరూధినిని దేశాక్షిరాగం మేళవింపమని కోరినప్పుడు

"వాలారుం గొనగోళ్ళ నీవలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలన్ నీవంటమింజేసియా
యాలాపంబె యవేళ బాడుచు ప్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి దేశాక్షికిన్."

ఏయే కాలాలకు ఏయే రాగాలు మేళవించవలెనో సంగీత శాస్త్రాభిజ్ఞులకు మాత్రమే తెలిసే విషయం. ఇంకా వైద్యశాస్త్ర, జ్యోతిశ్శాస్త్ర, శకునశాస్త్ర సంబంధి విషయాలు కూడా మనుచరిత్రలో ఉన్నాయి. ధర్మశాస్త్రానికి ప్రవరుడే స్థానం. నీతి శాస్త్రానికి కూడా మనుచరిత్రలో స్థానముంది. అలంకార శాస్త్ర విషయాల గూర్చి ప్రత్యేకంగా చెప్పేపని లేదు. మనుచరిత్ర అలంకార శాస్త్ర మర్యాదలకు నెలవైన ఉత్తమ కావ్యం. శబ్దార్థాలంకారాలలో మనుచరిత్ర మేటి రచన. పెద్దనకు అర్థాలంకారాల పట్లే మక్కువ ఎక్కువ, ముఖ్యంగా భ్రాంతి మదాలంకార రచన మనచరిత్రలో అత్యంత ప్రాధాన్యం కల్గింది. వరూధిని మయా ప్రవరుడిని చూచి నిజంగా ప్రవరుడే అనుకున్నది. కథ ముందుకు సాగడానికి వరూధిని భ్రాంతియే కారణం. భ్రాంతి ఒక్క వరూధినికే కాదు. ఒక్కొక్కప్పుడు ఎంతటి వారలకైన కలుగుతుంది. అని చెప్పడానికా అన్నట్లు పెద్దన ఇష్ట దేవతాస్తుతిలో సనందనాదులకు కలిగిన భ్రాంతిని వర్ణించాడు. ఇందులో ఆగామి కథాసూత్రం ఇమిడి వుంది.

"శ్రీవక్షోజకురంగనాభమెదపై చెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలా సమీపమున బ్రీతిన్నిల్పి నాడోయనం

గావందారు సనందనాది నిజభక్త శ్రేణికిం దోచురా
జీవాక్షుండు కృతార్థుజేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్."

ఏది మనసులో గాఢంగా ముద్రితమౌతుందో అదే కట్టెదుట సాక్షాత్కరిస్తుంది.

"అంకము జేరి శైలతనయాస్తన దుగ్ధములానువేళ బా
ల్యాంక విచేష్ట దొండమున నవ్వలిచన్ కబళింపబోయి యా
వంక గుచంబు గాన కహీవల్లభహారము గాంచివేమ్మృణా
ళాంకుర శంక నంటెడు గజాస్యుని గొల్తునభీష్టసిద్ధికిన్"

స్వభావోక్తి కూడ మనుచరిత్ర అంతటా కనిపిస్తుంది. తెలుగు పలుకుబళ్ళు ఆత్మీయతకు దోహదం చేస్తాయి.

"అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ",

"మీ మాటలు మంత్రంబులు మీ మెట్టినయెడ ప్రయాగ",

"సందియము దెలియ నడుగుట తప్పా"

"ఇనుప కచ్చడాల్ గట్టుకోను మునిముచ్చులెల్ల"

"దామరసనేత్రలిండ్ల బందాలుగారె"

"ఇట్టి తుచ్చ సుఖముల్ మీసాలపై దేనియల్"

"గుంట్రాడాచిన బెండ్లి యేమిటికి జిక్కుం గష్టముష్టింపచా",

"దైవము దోసకారులకె తోడైవచ్చునెప్పట్టులన్"

ఇటువంటివి లోకోక్తులుగా నిలిచిపోయాయి. సంస్కృత సమాసాలు తెలుగు పదబంధాలు గంగా యమునల వలె కలిసిపోయాయి. మనుచరిత్ర అందంతటా.

"పెద్దన వలె కృతి సెప్పిన
పెద్దన వలె నల్పకవిని పెద్దన వలెనా
యెద్దనవలె మొద్దనవలె
గ్రద్దనవలె కుందవరపు కవి చౌడప్పా"

కవి చౌడప్ప ప్రశంసకు పాత్రుడైన అల్లసాని పెద్దన శిరీష కుసుమపేశల సుధామయోక్తులు మనుచరిత్రను సుసంపన్నం, సురుచిరం, సుప్రసన్నం చేశాయి. ద్రాక్షపాకంలో తీగెలు సాగిన సొంపు ఈ రచనలో ఉంది.



"కమ్మని కుందనంబు కసుగందని మేనెలదేటి దాటులన్
బమ్మెర వోవదోలు దెగబారెడు వెంద్రుక లిందుబింబముం
గిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూపులు కొనుగానరా
దమ్మక చెల్ల వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్"

అల్లసానివాని అల్లిక జిగిబిగి అనడం కూడా సుప్రసిద్ధమే.

"ఫుల్ల లవీల నవైలా
వల్లి మతల్లికలతోడ వాసంతికలు
దృల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొక లతాగృహాంతర సీమన్"

"కాంచి కల క్వణత్కనక కాంచికయై యెదురేగి యప్పుడ
క్కాంచన కేతకీకుసుమ గాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచల వీధి దాఱుచు ఘనాంత చలచ్చపలాకృతిం గలం
గాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లనురక్తి గాంచుచున్" (3-89)

శబ్ద సౌష్ఠవమే కాదు అర్థసౌభాగ్యం కూడా నిండి ఉన్న రచన ఇది. వరూధిని చేష్టలు, స్వభావం కళ్లకు కడ్తున్నాయి.

పెద్దన రచనా కౌశలం, మాటల కూర్పు, లోకానుభవం, స్వాభావిక వర్ణనలు రసభావపుష్టి మనుచరిత్ర విశిష్టతకు మూలకారణాలు. మాయాప్రవరుని చూసిన వరూధిని హావభావ చేష్టలను పెద్దన వర్ణించిన సందర్భంలో పై లక్షణాలన్నీ కనిపిస్తాయి. నాటకీయంగా ఉన్న రచన ఇది.

"తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడ
పల్లవాధర గుండె జల్లుమనియె
నట రెండు మూడంజలరుగు నప్పుడ కాళ్ల
బంకజాక్షికి తొట్రుపాటు గదిరె
డాయంగ జనునప్పుడ ముఖాంబుజంబున
గంబు కంధరకు దైన్యంబు దోచె
గదిసి నిల్చినయప్డ కనుదోయి తెప్పల
లలనకు మిగుల జంచలత బెరసె
గటకటా యనునపుడ గద్గదిక వొడమె
చెఱగు పట్టిన యపుడలే జెమట గ్రమ్మె

సొలసి మాటాడనుంకింప దలచి మోము
దేరకొని చూచునపుడ కన్నీరు వొడమె" (3-91)

మానవస్వభావానుగుణమైన ఇట్టి వర్ణనలు మనుచరిత్రను ప్రథమ శ్రేణిలో నిలబెట్టాయి. ఒక యుగాన్ని ప్రభావితం చేసిన తొలి ప్రబంధం మనుచరిత్ర. తరువాత వచ్చిన కవులెవ్వరూ మనుచరిత్ర ప్రభావాన్ని కాదనలేకపోయారు. అందుకే పెద్దనకు ఆంధ్ర కవితాపితామహుడనే బిరుదనామం అన్వర్థమైంది. మనుచరిత్ర కృష్ణరాయల వంటి సాహితీ ప్రియ భావుకుని మన్ననకు సర్వథా పాత్రమైంది.

శ్రీకృష్ణదేవరాయల పరిపాలనాకాలంలో దేశం సుభిక్షంగా ఉండడం చేత ప్రజలలో కళలపట్ల ఆసక్తి పెరిగింది. రాయలు స్వయంగా ఆముక్తమాల్యద వంటి ప్రౌఢ ప్రబంధాన్ని రచించిన రసజ్ఞ ప్రభువు. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన రాయలకాలంలో తెలుగు సాహిత్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా వికసించింది. మనుచరిత్ర రచనతో ప్రబంధ ప్రక్రియ కవులందరికి ఉపాదేయమైంది.

నాయకరాజుల కాలం వచ్చేసరికి రాసిక్యం భోగలాలసతగా మారింది. కావ్యాలు మితిమీరిన శృంగార వర్ణనలతో, కథాగతికి భంగం కలిగించే అలంకారాలతో గతానుగతికమైన రచనా రీతులతో జుష్టమై విమర్శలకు పాత్రమయ్యాయి. ప్రబంధాలనన్నింటినీ విమర్శించడం ఆధునిక కాలంలో పరిపాటి అయింది. కానీ రాయల కాలంనాటి ప్రబంధాలకు నాయకరాజుల కాలం నాటి ప్రబంధాలకు స్పష్టమైన విభజనరేఖలున్నాయి. మనుచరిత్రాదులు ఉత్తమ కావ్యాలు, అవశ్యం పఠనీయాలు. తెలుగు భాష పూర్తిస్థాయిలో సంస్కృతానికి దీటుగా నిలిచిన వైఖరి ఈ ప్రబంధాలలో కనిపిస్తుంది. ఆంధ్రదేశంలో భారత భాగవతాల తర్వాత పఠనపాఠనలలో వాసికెక్కింది మనుచరిత్రే. భాషమీద అధికారం సాధించాలంటే ప్రాచీన సాహిత్యం ముఖ్యంగా ప్రబంధాలు చదివి తీరాల్సిందే. భాషాశాస్త్రవేత్తలు గుర్తించిన విషయం ఇది.

'ప్రబంధాలలో భాషా స్వరూపం' అనే అంశం మీద పరిశోధన చేసి అపూర్వమైన విషయాలను వెలికి తీసిన వ్యాకరణవేత్త డా. రావి భారతిగారి స్మృత్యంకంగా ఇప్పుడు మనుచరిత్ర తెలుగు విశ్వవిద్యాలయం వారిచే పునర్ముద్రింప బడడం ముదావహం.

**పీఠిక, అల్లసాని పెద్దన మనుచరిత్ర**
**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**
***2001***



# శ్రీకాళహస్తి మాహాత్మ్యము-ప్రబంధ లక్షణాలు

16వ శతాబ్దంలో వెలువడిన కావ్యాలన్నింటినీ ప్రబంధాలుగా పరిగణించడం మనకు పరిపాటి అయింది. ప్రబంధ శబ్దచర్చ తరువాత ప్రబంధమంటే కావ్యానికి పర్యాయపదమే అనే నిర్ణయానికి రాక తప్పదు. సంస్కృతకవులు, అలంకారికులను ప్రక్కన బెట్టి తెలుగు కవులను మాత్రమే తీసుకుంటే కూడా ఈ విషయం మనకు అర్థమవుతుంది. పరంపరగా కొన్నింటిని మనం ప్రబంధ లక్షణాలుగా చెప్పుకుంటున్నాం. 16వ శతాబ్దంలో వచ్చిన ప్రౌఢకావ్యాలను దృష్టిలో పెట్టుకొని కొన్ని సామాన్య లక్షణాలను వెలికితీసి ఈ విధమైన లక్షణాలను చెప్పడం జరిగింది. ఆ తరువాత వీటిని ఆయా కావ్యాలకు అన్వయించడం మొదలుపెట్టాం. ఇదంతా స్థూలం జరిగిన మూల్యాంకనమే గాని మరొకటి కాదు. మనం చెప్పుకుంటున్న ప్రబంధ లక్షణాలు కాళహస్తిమాహాత్మ్యానికి అన్వయించవు. ఆ మాటకువస్తే ఏ ప్రబంధానికి ఈ ప్రబంధ లక్షణాలనబడేవి వర్తించవు.

యుగ విభజన పేరుతో 16వ శతాబ్దాన్ని ప్రబంధయుగం అనడం ప్రారంభించాం. అంతేకాదు ఈ యుగంలో వచ్చిన ప్రతి కావ్యాన్ని ప్రబంధం అని పిలిచాం. లేని ప్రబంధ లక్షణాలను వెదకటం ప్రారంభించాం. అంటే ఒక కాలంలో వచ్చిన ప్రతి కావ్యం ఒకే ప్రక్రియకు చెందింది అయి ఉండాలని భావించామన్నమాట. ప్రక్రియను నిర్ణయించవలిసి వస్తే కూడా కాలాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకోవాలా అనేది చర్చనీయాంశం. అలా తీసుకుంటే కొన్ని చిక్కులెదురౌతాయి.

పురాణయుగంలో కుమారసంభవాది కావ్యాలు వెలువడ్డాయి. 12వ శతాబ్దంలో బసవ పురాణం వచ్చింది. పురాణమనే పేరుతో వెలువడ్డ తొలి స్వతంత్ర చరిత్ర కావ్యమిది. అలాగే కావ్యయుగంలో భాగవతం వచ్చింది. ఇది కావ్యలక్షణాలను సంతరించుకున్న పురాణం. ఇంక ఆధునిక యుగానికి వస్తే అన్ని ప్రక్రియలు వచ్చాయి. కాని అన్నిటినీ నవ్యకవిత్వం అనలేని పరిస్థితి ఏర్పడింది. కాబట్టి కాలం అనేది ప్రక్రియను నిర్ణయించేటప్పుడు అంత ప్రధానమైన అంశం కాదు. కాల ప్రభావం మాత్రం ఆ కాలంలో వెలువడిన రచనల మీద తప్పక ఉంటుందనేది సారాంశం.

శ్రీకాళహస్తి మాహాత్మ్యం క్షేత్రమాహాత్మ్యం అని పేరును బట్టే తెలుస్తుంది.

ఈ రకమైన కావ్యాలకు శ్రీకారం చుట్టినవాడు ఎర్రన. నృసింహపురాణ రచన వలననే ఎర్రనకు ప్రబంధ పరమేశ్వరుడనే బిరుదు సార్ధకమైందని పండితుల నిశ్చితాభిప్రాయం. అంటే క్షేత్రమాహాత్మ్యాలను కూడ ప్రబంధశబ్దంతో వ్యవహరించబడడం అప్పుడే జరిగిందన్నమాట. 16వ శతాబ్దికి పూర్వమే ఇలా జరగడం గమనార్హం.

నృసింహపురాణం తరువాత వచ్చిన కాశీఖండం, భీమఖండం, హరవిలాసం ఈ కోవలోకే వస్తాయి. అయితే మనం శ్రీనాథుడిని ప్రబంధకవి అనం. అసలు మనం అలవాటుగా చెప్పుకునే ప్రబంధ లక్షణాలన్నీ సంపూర్ణంగా అన్వయించదగిన ఏకైక కావ్యం శ్రీనాథుని శృంగారనైషధం. అనువాదమనే ఒక్క కారణం చూపి దానిని అటు మహాకావ్యమని గాని, ఇటు ప్రబంధమనే పేరుతో గాని పిలవకుండా వదిలేశాం. అంటే శ్రీనాథుడి కావ్యంగాని, క్షేత్రమహాత్మ్యాలు గాని ప్రబంధాలని పిలవడానికి పనికి రాకుండా పోయాయన్నమాట. ఇదొక విచిత్రమైన పరిస్థితి.

నన్నెచోడుడు తన కుమారసంభవాన్ని ప్రబంధమన్నాడు. తిక్కన మహాభారత పర్వాలను ప్రబంధ మండలి అని పేర్కొన్నాడు. నన్నయ ప్రబంధ శబ్దాన్ని వాడి ఉన్నాడు. అంటే ప్రబంధ శబ్దం తెలుగు సాహిత్యం ఆవిర్భవించిన నాటినుంచే వాడబడుతూనే వచ్చిందన్నమాట. ఇది కావ్యశబ్ద పర్యాయవాచి మాత్రమే కాని ఒక ప్రక్రియాసంబంధి కాదు. దీనికంటూ ప్రత్యేకంగా లక్ష్యలక్షణ నిర్దేశం చేయవలసిన పని లేదు. చేసిన అది అవిచార మూలకమే కాని అన్యం కాదు. క్రియ అంటే దానికి ఒక ప్రత్యేకలక్షణ స్వరూపం ఉండి తీరాలి. దాని ననుసరించే లక్ష్యం కూడా.

నిజానికి నృసింహపురాణం, కాశీఖండం, భీమఖండం, హరవిలాసం, హరివంశం, భాగవతం, కాళహస్తిమాహాత్మ్యం, ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యం ఇత్యాది గ్రంథాలన్నీ భక్తి ప్రధానాలు. భక్తి ఈ గ్రంథాలలోని ఏకైక ప్రధానాంశం. భక్తి భావమా, రసమా అనేది తరువాత మాట. వస్తువు మాత్రం కాదు. ఇది తెలియక వస్త్వైక్యం అంటూ ఒక దానిని సాధించాలి. అని ప్రయత్నించి దానికి భక్తిని అడ్డం పెట్టుకోవడం అవాంఛనీయం. ఇంక కొంతమంది కాళహస్తి మాహాత్మ్యం శాంతరస ప్రధానమైన ప్రబంధం అనడం జరిగింది. శాంతం రసమని అంగీకరించినా దానిని కాళహస్తి మాహాత్మ్యానికి అన్వయించడం కుదరదు. పైగా భిన్నమైన మనఃప్రవృత్తులు కలిగిన కావ్యగత పాత్రలు ఆధారంగా రసనిర్ణయం ఎలాచేయగలం? విభావానుభావ సంయోగంతో కదా రసనిష్పత్తి జరిగేది. నాయకుడే లేని క్షేత్రమాహాత్మ్యాలలో ఇది ఎలా సాధ్యం? భగవంతుడే నాయకుడంటారు కొంతమంది. నయతి వృత్తం ఇతినాయకః



అని కదా నిర్వచనం. కథ ఆరంభంలో గాని, నడుమగాని భగవంతుని ప్రసక్తి లేకుండా ఉన్న కథలలో ఈ నిర్వచనాన్ని అన్వయించడం కుదరదు కదా. కనుక వీటిని అనవసరమైన చర్చలకు గురిచేసి దూరాన్వయాన్ని సాధించడం కంటే భగవద్భక్తి ప్రధానాలైన కావ్యాలు గానే గుర్తించడం మేలు.

వీటన్నింటినీ ఒక genre గా గుర్తించి క్షేత్రమాహాత్మ్యాలు లేదా స్థలపురాణాలు అనవచ్చా అని ఆలోచిస్తే ఇక్కడొక చిక్కు ఉంది. భక్తి భావప్రధానాలైన పై గ్రంథాలన్నీ క్షేత్రమాహాత్మ్యాలు కావు. కొన్ని ఆయాదైవత ప్రధానాలు. క్షేత్రప్రాధాన్యం కలవి కొన్ని, అంటే హరవిలాస, హరివంశ, భాగవతాదులు క్షేత్రమాహాత్మ్యాల కిందికి రావన్నమాట. భక్తి ఒక్కటే వాటికీ వీటికీ సామాన్యసూత్రం.

శతక వాఙ్మయాన్నీ, ద్విపద సాహిత్యాన్నీ, పదసంపదనూ ఎలా ప్రత్యేక పరిధులలో అధ్యయనం చేస్తున్నామో అలాగే క్షేత్రమాహాత్మ్యాలను కూడా మిగతా కావ్యాల కంటే భిన్నమైనవిగా గుర్తించి పరిశీలించాలి. వీటిని మను, వసుచరిత్రాదులతో, పారిజాతాపహరణ, కళాపూర్ణోదయాదులతో పోల్చిచూడడం తగదు. ద్వ్యర్థి కావ్యాలను విడిగా చూడవలసిందే గదా. అలాగే ఈ భక్తి సంబంధికావ్యాలు కూడా ప్రత్యేక అధ్యయనాన్ని అపేక్షించేవి.

వీటిని మళ్ళీ శివభక్తి ప్రధానాలు, విష్ణుభక్తి ప్రధానాలు ఇంకా ఇటీవలి కాలంలో వస్తున్న అన్యదైవతసంబంధులు అని విభాగించడానికి వీలౌతుందేమో చూడాలి. వీటిలో కొంత చరిత్ర, కొన్ని నాటికీ నేటికీ ప్రసిద్ధంగానే ఉన్న స్థలాలు, తీర్థాలు ఉంటాయి. వాటిని గూర్చి అధ్యయనం చేయడం వలన సంస్కృతీ సంబంధ విషయాలు వెలుగులోకి వచ్చే అవకాశముంది. గ్రామనామాదులు, ఆచారవ్యవహారాలు మొదలైనవి అధ్యయనం చేయడానికి ఈ గ్రంథాలు ఉపకరిస్తాయి.

ఉదాహరణకు 16వ శతాబ్దంలో వచ్చిన కావ్యాలలో కాళహస్తి మాహాత్మ్యం, ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యం సాంఘిక జీవనాన్ని బాగాచిత్రించాయని గుర్తించగలం. సిరియాళుని కథలో, తిన్నని కథలో భక్తి తీవ్రక్రియా ప్రేరకం కావడం ఆలోచనీయం. అదే మాలదాసరి వృత్తాంతంలో ముగ్ధభక్తి మనోహరంగా చిత్రీకరింపబడడం గమనార్హం. తిన్నని వృత్తాంతం కోయజీవితానికి పట్టిన నిలువుటద్దం. యామునాచార్యుడు, నత్కీరుడు ఉదాత్త పాత్రలకు ప్రతీకలు. శివుడైనా సరే నమ్మిన సిద్ధాంతాన్ని వదులుకోని నత్కీరుడు ఒకవిలక్షణమైన పాత్ర.

ఇతర భక్తి కావ్యాలలో ఉండే గుణనిధి, సుకుమారుడు,నిగమశర్మ వంటి

భ్రష్టపాత్రలు కాళహస్తి మాహాత్మ్యంలో లేకపోవడం విశేషం. ఎన్ని తప్పులు, పాపాలు చేసినా చివరలో ఒక్కసారి భగవన్నామస్మరణ చేస్తే చాలు అన్ని పాపాలు పోతాయి అనడం సరికాదేమో!

ఇక రచనా రీతిని పోల్చిచూస్తే కాళహస్తి మాహాత్మ్యం మీద బసవ పురాణం ప్రభావం ఎక్కువేమో అనిపిస్తుంది. సమీపపూర్వంలోని భాగవత ప్రభావం చాలా తక్కువే అని చెప్పవచ్చు. కర్ణాటకిరాట కీచకులని పోతన అన్నాడని చెప్పుకుంటాం. ధూర్జటి అన్న 'రాజులు మత్తు'లో ఆలోచించాల్సిన అంశం ఇది.

భాషవిషయానికి వస్తే సరళసుబోధకమైన పదప్రయోగం, సరళరచనారీతి ధూర్జటి కవితకు పెట్టని ఆభరణాలు. అతులిత మాధురీమహిమ అందువలననే అమరింది. నుడికారపు సొంపు, తెలుగుభాషా యోగనిసర్గ సౌందర్యం కాళహస్తి మాహాత్మ్యం ప్రఖ్యాతికి ప్రధాన హేతువులు. నాతి కఠినమైన ధూర్జటిశైలి అనన్య సామాన్యం. ఆనాటి ప్రబంధరచనకు పూర్తిగా విరుద్ధం. ముఖ్యంగా పాండురంగ మాహాత్మ్యం, అముక్తమాల్యదలతో పోల్చిచూచినప్పుడు కాళహస్తి మాహాత్మ్యం లోని సరళశైలి హాయిని గొలుపుతుంది. ఇది సామాన్యపాఠకుడిని సైతం అలరించేశైలి. ఒకవిధంగా ఆ కాలానికి భిన్నమైన రీతి.

అయితే కాళహస్తి మాహాత్మ్యం మీద తత్కాల ప్రభావం అసలే పడలేదని కాదు. అక్కడక్కడ చేసిన వర్ణనలలో, అలంకారాలలో ముఖ్యంగా వేశ్యామాత తన కుమార్తెలకు చేసే వేశ్యావృత్తి ధర్మబోధలలో మేరమీరిన సందర్భాలు గోచరిస్తాయి. ఆకాలంలో గోదాదేవిని రాయలు వర్ణించేటప్పుడు కూడా ఈ బాధతప్పలేదు. ఇవి యుగప్రభావం గాఢంగా పడిన సందర్భాలు అని చెప్పుకొని సరిపెట్టుకోవలసిందే.

శబర జీవితాన్ని వర్ణించిన సందర్భంలో ఉన్న ఒక పద్యంతో ధూర్జటి రచనలోని సహజ సుందరమైన శైలిని చూపవచ్చు. దీనిలోని రామణీయకత వ్యాఖ్యానాన్ని అపేక్షించేది కాదు.

"పట్టుచీరల గట్టు భాగ్యంబు గల్గియు
బాఱుటాకుల గట్ట భారమనరు
రాజన్న భోజన ప్రాభవ శ్రీగల్గి
యును వన్య ధాన్యంబు నొల్లమనరు
మాణిక్య భూషా సమాజంబుగల్గియు
నెఱ్ఱని గురువింద లేటి కనరు
మంచి మెచ్చులితూగు మంచముల్గల్గియు
జాబు బూదిగయు య్యాలలనరు,
ఎంత సంపద గల్గియు నెట్టివారు
దమకులాగత ధర్మ కర్మలులు ఎడువ
జాలరటు కాన దత్పురీ శబర సతులు
మహిమ గలిగియు మానరుసహజవృత్తి (3.6)

ఇటువంటివి కాళహస్తి మాహాత్మ్యంలో ఎందెందు వెదకి చూచిన అందందే గలవు. నిరలంకార, నిసర్గసౌందర్యశోభితాలైన ఇట్టి పద్యరచన వలననే మహాకవి ధూర్జటి రచించిన కాళహస్తి మాహాత్మ్యం ఆ యుగంలోని రచనలకు ధీటుగా నిలువగలిగినది. ధూర్జటి కవితను ఒకవేళ మించినదిగా చెప్పవలసివస్తే ఆతనిదే అయిన శ్రీకాళహస్తీశ్వర శతకమే మనకు శరణ్యం.

క్షేత్రమాహాత్మ్యాలను భక్తి ప్రధానమైన ఇతర గ్రంథాలను ఒక ప్రక్రియగా గుర్తించి వాటిలోని భేదసాదృశ్యాలను పరిశీలించి మేలిమి గుణాలను, సామాజిక అంశాలను వెలికి తీయాలని ఈ పత్రసారాంశం. అప్పుడు మరుగున పడిఉన్న ఎన్నో మంచి విషయాలు బహిర్గతమౌతాయి.

*2002లో ఆంధ్రవిశ్వవిద్యాలయం నిర్వహించిన*
*యుజిసి సదస్సులో సమర్పించిన ప్రసంగపత్రం*

# రామదాసు కీర్తనలు - నవవిధ భక్తులు

నారదుడు భక్తిని నిర్వచిస్తూ భగవంతుని యెడల శ్రేష్ఠమైన ప్రేమరూపమే భక్తి అన్నాడు. "స్వాతస్మిన్ పరమ ప్రేమ రూపా." భక్తునికి భగవంతునిపట్ల ఉండే పూజ్యభావమే భక్తి. అది మళ్లీ సగుణభక్తి, నిర్గుణ భక్తి అని రెండు రకాలు. రెండవది యోగులకు మాత్రమే సాధ్యమైనది. భగవంతుడిని చేరడానికి ఉండే భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలలో కూడా భక్తి సామాన్యులకు సైతం సాధ్యమయ్యేది. భక్తిని ఎందరెందరో నిర్వచించి దానిలో గల అనేక భేదాలను కూడా చర్చించారు.

అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం అనేవి క్రమంగా శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు ప్రతిపాదించిన భక్తి మార్గాలే.

భక్తి రసామృత సింధువులో సాధన భక్తి, భావభక్తి, ప్రేమభక్తి అని భక్తి మూడు విధాలుగా విభజించబడింది.

సాంఖ్యమతానుసారం భక్తి నాలుగు విధాలు అని భక్తి రసాయనంలో చెప్పబడింది. అవి 1. రాజసం 2. తామసం 3. సాత్వికం 4. మిశ్రమం. రాజసానికి భీమ, ధ్రువాదుల భక్తిని పేర్కొనవచ్చు. తామసానికి చోరుల భక్తిని ఉదహరించవచ్చు. వ్యాసశుక నారదాదులది సాత్వికభక్తి. దేవతల భక్తి మిశ్రమం కిందికి వస్తుంది.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు తన భక్తులు నాలుగు రకాలవారని పేర్కొన్నాడు.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున।
అర్థో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥"

అన్నమయ్య, రామదాసు ఆర్తభక్తుల కోవలోకి వస్తారు. తత్వాన్ని అన్వేషించే యోగీశ్వరులు జిజ్ఞాసులే. సామాన్యులందరూ అర్థార్థులే. జ్ఞానిని నేనే అని శ్రీకృష్ణుడు స్వయంగా చెప్పాడు.

రామదాసుకి పూర్వుడైన అన్నమయ్య అతని సంతతివారు భక్తిని అనేక



విధాలుగా భావించారు. ఉన్మాదభక్తి, పతివ్రతాభక్తి, విజ్ఞానభక్తి, ఆనందభక్తి, రాక్షసభక్తి, తురీయభక్తి, తామసభక్తి, వైరాగ్యభక్తి, రాజసభక్తి, నిర్మలభక్తి అని పేర్కొంటూ అన్నింటిలో శరణాగత భక్తి శ్రేష్ఠమని భావించారు. "గట్టిగా శ్రీ వేంకటేశ్వర కైంకర్యమే సేసి తట్టు ముట్టులేనిదే తగ నిజభక్తి". శ్రీ వేంకటేశ్వరుని పట్ల అన్నమయ్యకు ఎటువంటి భక్తి ఉండేదో ఇంచుమించు అదే భక్తి రామదాసుకు శ్రీరామచంద్రుని పట్ల ఉండేది. వారి వారి జీవనవిధానాలను బట్టి తారతమ్యాలకు తావు ఏర్పడింది కాని ఇరువురిదీ అనన్యభక్తే!

భక్తి ఒకటే కాని వ్యక్తం చేసే విధానాలు వేరు. దానిని బట్టే రకరకాల వర్గీకరణాలు. భక్తికి సంబంధించినంత వరకు భాగవతం పరమోత్కృష్టమైంది. ఆ తరువాత చెప్పవలసింది ఏమీ లేదు. మొట్టమొదటిసారిగా నవవిధ భక్తులను ప్రతిపాదించింది భాగవతం. అవే అందరికీ మార్గదర్శకాలయ్యాయి. అయితే భక్తి రసం అవునా కాదా అనే చర్చలో మాత్రం ఆలంకారికులు భిన్న దృక్పథాలను వెలువరించారు.

ఏది ఏమైనప్పటికీ భగవంతుడిని సేవించడానికి అతి శ్రేష్ఠమైందీ, సులువైందీ భక్తి మార్గమే. తన్మయత్వం చెందిన భక్తుడు ఆ భగవంతుడిని చూడగలుగుతాడు. తన మనోనేత్రంతో, అటుపైన భగవంతుడికీ భక్తుడికీ మధ్యనున్న అంతరాలన్నీ ఒక్కటొక్కటిగా తొలగిపోతాయి. ఆ దశలో భక్తుడు భగవంతుడితోనే మాటలాడుతాడు. మొర పెట్టుకుంటాడు. ఒక దశలో తానే తల్లియై భగవంతుడిని బిడ్డడిగా భావించి లాలిస్తాడు లేదా మిత్రుడిగా ఎంచి సల్లాపాలాడతాడు. ఇవన్నీ దాటిన తర్వాత తనను తాను స్త్రీగా ఎంచుకొని ఆ పరమపురుషునికి అర్పణ చేసుకొంటాడు. అప్పుడది మధుర భక్తి అవుతుంది. అయితే అన్నమయ్య, రామదాసు ఈ కోవకు చెందినవారు కారు. ఇప్పుడు రామదాసు కీర్తనలలో నవవిధ భక్తుల ఛాయలను పరిశీలించవచ్చు.

## రామదాసు కీర్తనల్లో నవవిధ భక్తులు

"శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్"

సంస్కృత భాగవతంలో నవవిధ భక్తులు ప్రస్తావించబడ్డాయి. దీనికి పోతన అనువాదం -

తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, ఆత్మలో నెరుకయున్, సంకీర్తనల్, చింతనం

బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా.

ఇవి కాకుండా భక్తి అయిదు విధాలు అని ప్రాచీన మతం ఒకటి ఉంది. అవి శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభక్తులు. శాంతభక్తికి భీష్ముడు, విదురుడు, సఖ్యభక్తికి అర్జునుడు, కుచేలుడు, వాత్సల్యభక్తికి యశోద, దేవకీవసుదేవులు, దాస్యభక్తికి హనుమంతుడు, గరుడుడు, మధురభక్తికి శ్రీకృష్ణుని అష్టభార్యలు, గోపికలు ఉదాహరణలుగా భావించవచ్చు.

ఉద్వేగం లేకుండా నెమ్మదిగా శాంతంగా ఉండేది శాంతభక్తి. ఇది మొదటి దశ. దాసత్వ భావన కలిగినది దాస్యభక్తి. ఇది రెండవదశ. సంభ్రమ గౌరవాలు ఉండే ఈ దశలోనే పరాకాష్ఠ ఏర్పడితే అది సఖ్యభక్తి అవుతుంది. ఇది మూడవ దశ. సఖ్యభక్తిలో మాధుర్యం చేరితే అది మధురభక్తి అవుతుంది. ఇది ఐదవ దశ. భక్తి పరిణామంలో ఇది అత్యున్నతమైంది. ఉజ్జ్వలమైంది. దీనిలో మిగతా అన్ని భావాలు పర్యవసిస్తాయి. మధురభక్తిలో ఆనందపారవశ్యం కలుగుతుంది. దివ్య ప్రణయభావం భక్తుని భగవంతునికి చేరువయ్యేటట్లు చేస్తుంది. లౌకిక ప్రపంచ స్పృహను కోల్పోయే ఈ దశ భక్తికి పరాకాష్ఠ.

రామదాసు ప్రధానంగా దాస్యభక్తి, శాంతభక్తి ప్రధానాలైన కీర్తనలే వ్రాశాడు. మధురభక్తి ప్రతిపాదకమైన కీర్తనలు వ్రాయలేదు. రామదాసుకు పూర్వులైన పోతన్న, అన్నమయ్యల మీద మధురభక్తి ప్రభావం గాఢంగా ఉంది. రామదాసు మీద ఆ ప్రభావం లేకపోవడానికి కారణం అనూహ్యం. ఆయన జీవితంలో నిర్వహించిన బాధ్యతలు, అనుభవించిన శిక్ష, వేదన అందుకు కారణాలేమోనని ఊహించవచ్చు.

ఇక సంస్కృత భాగవతంలో ప్రస్తావించబడిన నవవిధ భక్తుల క్రమాన్ని పోతన మార్చడానికి హేతువులు తెలియవు. పద్య శిల్ప దృష్టితో మాత్రమే మార్చి ఉండవచ్చు. భక్తి భావాలకు వివరణ తోడు కావడం జరిగింది. సఖ్యం అన్న దానికి తనుహృద్భాషల సఖ్యం అనడం అందుచేతనే. 'ఆత్మనివేదనం' అన్నదాన్ని 'ఆత్మలోనెరుక' అని మార్చడం కొంచెం లోతుగా అధ్యయనం చేయాల్సిన విషయం. ఆత్మనివేదనం అన్నప్పుడు శరణాగతి భక్తి స్ఫురిస్తుంది. ఆత్మలోనెరుక అంటే జ్ఞానం అనే అర్థం. ఈ మార్పుకు భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలు మూడూ భగవంతుడిని చేరడానికి ఉపాదేయాలే అయినా భక్తిమార్గం సులువైంది, జ్ఞానమార్గం ఉత్తమమైంది అనే అభిప్రాయం కారణమని ఊహించాల్సి వస్తుంది. ఏది ఏమైనా పోతన క్రమాన్ని, భావాన్ని కొద్దిగా మార్చుకొని



వివరణాత్మకంగా చెప్పినట్లు తెలుస్తుంది.

రామదాసు భాగవతోత్తముడు. అసలు పేరును మర్చిపోయేటట్లు చేసింది అతని దాసభక్తి. 'నామస్మరణం' భక్తాగ్రేసరుడైన రామదాసుకు సహజమే. రామదాసు కీర్తనలలో ప్రధానంగా కనిపించేవి స్మరణం, కీర్తనం, అర్చనం, వందనం, ఆత్మనివేదనం, పాదసేవనం, దాస్యం అనే ఏడు భక్తి భావాలు. శ్రవణం, సఖ్యం అనేవి తత్ఫలితంగా సిద్ధించేవి. మొత్తానికి నవ విధ భక్తి భావాలతో శ్రీరాముని సేవించి, పరిపరి విధాల కీర్తించి భవబంధాలను కారాగారవాస రూపంలో అనుభవించి వాటి నుంచే కాక లౌకిక ప్రపంచవాసనల నుంచి కూడా విడుమర పొంది జీవన్ముక్తుడయ్యాడు రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న.

విస్తృత కథలతో, ఉపాఖ్యానాలతో కూడిన మహాభాగవతంలో నవ విధ భక్తులు ఆయా భాగవతుల కథలలో చూడవచ్చు. రామదాసు కీర్తనలలో రాముడొక్కడే రామదాసు ఒక్కడే! అన్య పాత్రలు లేవు, వారి కథలు లేవు. తన భక్తి భావమ్ములు తనవి గాన రామదాసు తనివిదీరా శ్రీరాముని అర్చించి, కీర్తించి, సేవించి, పూజించి కొండొకచో ఉపాలంభించి ఆత్మనివేదనం చేసుకొన్నాడు. శ్రీరాముని గుణగానం చేస్తూ పరవశించి తానే కర్త, శ్రోత కూడా అయినాడు. ఆ మహాభక్తుని చెరసాల పాలు గావించింది శ్రీరామ సేవనంలో లౌకిక వ్యాపార వైముఖ్యం ఏర్పడడం చేతనే. అది అతనికి పెట్టబడిన పరీక్ష కావచ్చు. అగ్నిలో పుటం పెట్టబడిన బంగారం రామదాసు విరచితమైన భక్తి సాహిత్యం. నిజానికి ధాతు, మాతుపుష్టి గల రామదాసు కీర్తనలను పాడి వినిపిస్తే గాని వాటిలో ఉండే శబ్దపుష్టి, రాగతుష్టి అనుభవానికి రావు. అయినా కేవలం సాహిత్య దృష్టితో రామదాసు కీర్తనలలో నవ విధ భక్తులను మనం అధ్యయనం చేయవచ్చు. ఆ ప్రయత్నమే ఈ పత్రం. అయితే ఈ కీర్తనలలో రెండు మూడు భావాలు ఒకే కీర్తనలో ఉండడం చాలా తరచుగా జరుగుతుంది. ఎందుచేతనంటే సృజనాత్మక సాహిత్యం శాస్త్రాధ్యయనం కోసం పుట్టేది కాదు. సృజన వ్యాపారం యథేచ్ఛగా సాగుతుంది. శాస్త్రం దాన్ని అనుసరిస్తుంది.

## రామదాసు కీర్తనలలో నవ విధ భక్తుల అన్వయం

### 1. శ్రవణం

వాగ్గేయకారుడు తాను రచించిన గేయానికి తానే స్వరకల్పన చేసుకొని గానం చేస్తాడు. గానం చేసేటప్పుడు తానే శ్రోతయై స్వరలయ విన్యాసాన్ని, సాహిత్య

సమన్వయాన్ని భావించుకుంటూ వింటాడు. మళ్లీ మళ్లీ పాడుకొని శ్రవణానందాన్ని పొందుతాడు. ఈ క్రమంలో వాగ్గేయకారుడే కవి, సంగీతకర్త, గాయకుడు కూడా. చివరి దశలో తానే శ్రోత కూడా అవుతున్నాడు. శ్రీ రాముడి పలుకులను విని ఆనందించాలని పరితపిస్తున్నాడు. ఈ కీర్తనంలో, ఇది సర్వజనాదరణను పొందిన రామదాసు ప్రసిద్ధ కీర్తనలలో ఒకటి.

"పలుకే బంగార మాయెనా – కోదండపాణి
పలుకే బంగార మాయెనా.....
పలుకే బంగారమాయె – పిలిచిన పలుకవేమి
కలలో నీ నామస్మరణ – మఱవ జక్కని తండ్రి

ఇందులో రాముని దర్శించాలనే తీవ్రమైన కాంక్ష. ఆయన పలుకులు విని తరించాలనే తపన ఉన్నాయి. మరి మరి పాడుకొని విని తన్మయత్వం చెంది ఉంటాడనడంలో సందేహంలేని కీర్తన ఇది.

నవవిధ భక్తులలో మొదటిది శ్రవణం. హరి కథా శ్రవణం నిరంతరం చేయడం ద్వారా ముక్తిని పొందవచ్చు. విద్యాగంధం లేనివారిని సైతం భాగవత కథా శ్రవణం భక్తివైపు మరలేటట్లు చేస్తుంది. రామదాసు కీర్తనలు ఆంధ్రదేశంలో అత్యంత ప్రాచుర్యం పొందడానికిదే కారణం.

**2. కీర్తనం**

భగవంతుని గుణగణాలను కీర్తించడంలో భక్తునికి అవధి తెలియదు. ఎంత కీర్తించినా తనివి తీరదు. రామదాసు కీర్తనలన్నీ భగవన్నామ సంకీర్తనలే. భక్తులకు అమిత పారవశ్యాన్నిచ్చేది గుణగానమే. పోతనతో ఇది ప్రారంభమై అన్నమయ్యతో విస్తరించి, రామదాసుతో కొనసాగి, క్షేత్రయ్యతో పుష్టినంది త్యాగరాజుతో మనోహరమైంది సుసంపన్నమైంది కీర్తనం. పద కవుల సాహిత్యంలో అత్యంత ప్రధానమైంది కీర్తనమే.

శ్రీరామ నీనామ మేమిరుచిరా
ఓ రామ నీ నామ మెంత రుచిరా....

కదళీ ఖర్జూరాది ఫలములకన్నను
పతిత పావన నామ మేమి రుచిరా

నవరస పరమాన్న నవనీతముల కంటె
అధికమౌ నీ నామ మేమిరుచిరా...

మరొక్క ఉదాహరణ



దశరథ బాల దాసానుకూల
దశముఖ కాల ధరణీశపాల
మారుతభీమ మాల్యాభిరామ
కళ్యాణ నామ కారుణ్యధామ
మురళీవిలోల మునిజనపాల
తులసీ వనమాల తుంబురలోల
రామదాసు రచించినవన్నీ కీర్తనలే నిజానికి.

**3. విష్ణోః స్మరణమ్**

నిజానికి భక్తులకు నిత్య విధి భగవన్నామ స్మరణమే. కలియుగంలో యజ్ఞయాగాది క్రతువులకన్నా నామ స్మరణమే ముక్తి దాయకమని భక్తులు విశ్వసిస్తారు. భగవంతుని నిత్యం స్మరించాలని తమకు తామే చెప్పుకోవడం ఇక్కడ విశేషం. ఆత్మ ప్రబోధం అన్నమాట.

"శ్రీ రాముల దివ్య నామస్మరణ సేయుచున్న జాలు
ఘోరమైన తపములను గోర నేటికే మనసా
తారక శ్రీ రామనామ ధ్యానము సేసిన జాలు
వేలు వేలు దైవములను వెదక నేటికే మనసా"

ఈ కీర్తనలో శ్రీ రాముని స్మరించడమే గాకుండ ఇతర సామాజికాంశాల ప్రస్తావన కూడా ఉంది.

"పరుల హింస సేయకున్న – పరమ ధర్మమంతే చాలు
పరులను రక్షింతునని పల్కనేటికే మనసా"
దొరకొని పరులధనము దోచకున్ననంతే చాలు
................................................
పరగ దీనజనులయందు పక్షముంచితంతే చాలు
................................................
అతిథివచ్చి యాకలన్న నన్నమిడినదే చాలు
క్రతువు సేయ వలయుననెడి కాంక్షలేటికే మనసా,

ఇంకొక్క ఉదాహరణ :

దినమే సుదినము – సీతారామ స్మరణయే పావనము
ప్రీతినైన బ్రాణ భీతినైన గలిమి
చేతనైన మిమ్మే తీరు దలచిన.........

**4. పాదసేవనమ్**

భగవంతుని పాదాలను నమ్మికతో పట్టుకొన్నవాడు ఎన్నటికీ చెడిపోడు. "అంబుజోదర దివ్యపాదారవింద చింత నామృత చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు" అని ప్రహ్లాదుడన్నా హరినామ సంకీర్తనమే చాలు అని అన్నమయ్య పాడినా సారాంశమదే. రామదాసు కష్టాలలో కాగినవాడు. ఎన్ని ఆటంకాలు ఏర్పడినా భద్రాద్రి రాముని పాదాలను పట్టి విడువనివాడు.

"నిన్నూ బోనిచ్చెదనా – సీతారామ
నిన్ను బోనిచ్చెదనా? – నన్ను రక్షింపక
యెన్ని విధముల నా కన్నులాన రామ ॥నిన్నూ॥
రట్టు చేసి నిన్నరి కట్టుదు నింక
దిక్కు గలిగితే మొఱ బెట్టుకోర రామ ॥నిన్నూ॥
గట్టిగ నీ పాద కమలము లెప్పుడు
బట్టి నామదిలో గట్టి వేయుదు రామ ॥నిన్నూ॥

రామదాసుకు తెలుసు భగవంతుడు భక్త వశంకరుడని, అందుకే వెళ్ళు చూద్దాం అంటున్నాడు. భక్తునికీ, భగవంతునికీ మధ్య రెండు రకాలైన సంబంధాలుంటాయి. ఒకటి కపికిశోర న్యాయం, రెండవది మార్జాల కిశోర న్యాయం. రామదాసుది మొదటి పద్ధతి. నన్ను విడిచి నువ్వు వెళ్ళలేవు. వెళ్ళినా నీతోనే నేనుంటాను అంటున్నాడీ కీర్తనలో. రాముని పాదాలను పట్టి విడువని వాడు కనుకనే రామదాసు డయ్యాడు.

**5. అర్చనమ్**

"ఏ తీరుగ నను దయ జూచెదవో – యినవంశోత్తమ రామా
నా తరమా భవసాగరమీదను నళిన దళేక్షణ రామా"
శ్రీ రఘునందన సీతారమణా – శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద నిను – గన్నది కానుపు రామా
మురిపెముతో నా స్వామివి నీవని ముందుగ దెల్పితి రామా
......................................................
క్రూరకర్మములు నేరక చేసితి నేరములెంచకు రామా
......................................................



బంధనమున నీ నామము దలచిన బ్రహ్మానందము రామా
దాసార్చిత మాకభయమొసంగవె దాశరథీ రఘురామా

భగవంతుని నానా విధాలుగా అర్చించడం 'అర్చనమ్' అనిపించుకొంటుంది. అయితే కారాగారంలో ఉన్న రామదాసుకు షోడశోపచారాలతో కూడుకొన్న నిత్యపూజా విధులు నిర్వర్తించడం అసాధ్యం అయినా ఆ మహాభక్తుడు మానసిక పూజ చేత దాన్ని సాధించాడు. భక్తి జ్ఞాన కర్మ మార్గాలలో రామదాసుకు భక్తి మార్గమే ఉపాదేయమైంది. రామదాసు తన కీర్తనల ద్వారా తాను భగవంతుని అర్చించడమే కాకుండా వాటిని విన్న వారికి, పాడినవారికి కూడా ముక్తిమార్గం దొరికేటట్లు చేశాడు.

**6. వందనమ్**

"అంతా రామమయం – బీ జగమంతా రామమయం" అని భావించి ఆ రామచంద్రుని సేవలోనే తరించిన రామదాసు కీర్తనలన్నీ వందనకుసుమాలే.

"ఆనంద మానంద మాయెను" అనుకుంటూ నిత్య మానస పూజలు చేసుకొన్న ధన్యుడు రామదాసు.

"ఇతర చింతనలిక చేయము – ఇతర
దైవముల గొనియాడము – ధరా
పతులకు జిక్కి చింత సేయము ఇన
కుల చంద్రుడౌ భద్రాచలరాము గొలుతుము"

ఈ కీర్తనలో కూడా సామాజికాంశాలు ప్రస్తావించబడ్డాయి. పరభాషలపై భ్రాంతి తొలగిందని పరులు దోషములెన్న నెదురాడమని చెప్పుకోవడం గమనార్హం. దారిద్ర్యములెల్ల మది నెంచము అనే నిబ్బరం కూడా ఈ కీర్తనలో కనిపిస్తుంది.

శ్రీ రామనామాన్ని నిరంతరం జపించి తరించినవాడు రామదాసు. నీవే తప్ప ఇతఃపరంబెరుంగను అన్న గజేంద్రునివంటివాడు రామదాసు. సంరక్షింపు భద్రాత్మకా అనుకొన్న గజేంద్రుని రక్షించినట్లే శ్రీరామభద్రుడు రామదాసుని కటాక్షించాడు. వైయక్తికమైన రామదాసు భక్తి ఆయన కీర్తనల ద్వారా సామూహిక భక్తి ప్రవాహానికి దారులు తీసింది.

**7. దాస్యమ్**

దాసభక్తి అన్నిటి కంటే శ్రేష్ఠమని వైష్ణవులు భావిస్తారు.

"మజ్జన్మనః ఫలమిదం మధుకైట భారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య
భృత్యసత్య భృత్య ఇతి మాం స్మరలోకనాథ!"

ఈ భావాన్ని రామదాసు కీర్తనలలో మనం చూడగలం. భగవంతుడిని పరిపూర్ణంగా విశ్వసించిన భక్తుడు తనను దాసానుదాసునిగా భావించుకోవడం పరిపాటి.

"శరణాగత రక్షణ బిరుదని నే
శరణంటి గదయ్యా
వెఱవకుమని యభయంబొసగవె నను
గన్న తండ్రివయ్యా
ఆది దేవ మీ చిత్తము భాగ్యము
భావమెవరిదయ్యా
నీ దాసులకును నే దాసుడ దయ
యుంచి యేలుమయ్యా!"

రామదాసు ప్రవచించిన భక్తి పలు విధాలుగా కనిపించినా మరలనది దాస్యభక్తిగానే పరిణమిస్తుంది. నిరహంకార రూపమైనదే దాస్యభక్తి. దాసానుదాసుడు అనడం అందుచేతనే.

**8. సఖ్యమ్**

"రామసుధాంబుధి ధామా నాపై
నెందుకు దయ రాదురా?
వేమఱు వినయముతో వివరించినా నాదు
విన్నపమూ వినవేమిరా?"

– అని బ్రతిమాలుకొంటున్నాడు రామదాసు.

"నిక్కముగా తల్లివి – తండ్రివి నీవని
నెఱ నమ్మి యున్నానురా
దిక్కు నీవని యున్న దయ జూడవిక మాకు
దిక్కెవరున్నారురా
యెక్కడనున్నావో – నా మొఱాలకించ
వింత పారాకేలరా" – అని ప్రాధేయపడుతున్నాడు.

ఇంతకంటే ఇంకా కొంత దగ్గరితనంతో తనకున్న చనువుతో స్వామినే నిలదీస్తున్నాడు చూడండి.

"సీతారామ స్వామీ – నే – జేసిన నేరములేమీ
ఖ్యాతిగ నీ పదకంజయుగమునే
ప్రీతిగ దలపక భేదమెంచితినో?
రంగుగ నా పదివేళ్లకు రత్నపు
టుంగరములు నిన్నడిగితినా?
సంగతి బంగరు సేలువ పాగా
లంగీల్ నడికట్టడిగితినా?
చెంగటి భూసుర పుంగవులెన్నగ
చెవులకు చౌకట్లడిగితినా?
ముంగర గొలుసులు ముత్యపుసరములు
నంగనలకు విన్నగితినా?

ఇలా అది అడిగినా ఇది అడిగినా అని స్వామిని రెట్టించి మరీ అడగడం ఇందులో విశేషం. భక్తులు సాధారణంగా అడగడానికే దేవుడిని ఆశ్రయిస్తారు. అలాంటి వాణ్ని కాదు నేను అని నీవు నన్ను గుర్తించలేదా అని ప్రశ్నిస్తున్నాడు. ఇలాంటివి ఇంకా కొన్ని కీర్తనలు కూడా ఉన్నాయి.

**9. ఆత్మనివేదనమ్**

ఆత్మార్పణం చేసుకొన్న అరిది భక్తి రామదాసుది. అయినా కరుణించలేదు. ఆ జగన్నాటక సూత్రధారుడు. అప్పుడు అమ్మతో మొర పెట్టుకున్నాడు. అప్పుడుగాని అయ్యగారి కటాక్ష వీక్షణాలు దాసునిపై బడలేదు.

"పాహి రామప్రభో – పాహి రామప్రభో
పాహి భద్రాద్రి వైదేహి రామప్రభో
పాహిమాం శ్రీరామా యంటే పలుకనైతివీ నీ
స్నేహితమెట్టిదని చెప్పు" – అని వాపోయిన వెనుక "నరహరిని నమ్మక నరులను నమ్మితే నరజన్మ మీదేరునా? చెఱకులుండగ వెఱ్ఱి చెలుకులు నమలితే జిహ్వకు రుచి పుట్టునా మనసా?" అని పరిణతిని పొంది తన్నుతాను నివేదనం

చేసుకొన్నాడు. అప్పటికీ దయరాకపోతే అమ్మను ఆశ్రయించాడు.

"నను బ్రోవుమని చెప్పవే - సీతమ్మ తల్లీ
నను బ్రోవుమని చెప్పవే!
నను బ్రోవుమని చెప్పు నారీ శిరోమణి
జనకుని కూతురా జననీ జానకమ్మ"

ఇక్కడ కొంత సీతారాముల ప్రణయాన్ని వర్ణించిన విధం అన్నమయ్య ప్రభావంతోనే చేసి ఉండవచ్చనిపిస్తుంది.

"ప్రక్కను జేరుక - చెక్కిలి నొక్కుచు
జక్కగ మరుకేళి - సొక్కి యుండెడి వేళ ॥నను॥
లోకాంత రంగుడు - శ్రీకాంత నిను గూడి
యేకాంతమున నేక - శయ్యనున్న వేళ ॥నను॥

రెండు పాదాలలో కనిపించినా వారు ఒక్కరే. విడదీయరాని వారి సంబంధాన్ని మహాకవి వాగర్థాలతో పోల్చి చెప్పినా నీవు స్వామికి విన్నవించు తల్లీ అని రామదాసు వేడుకొన్నా ఆంతర్యం అదే. ఆయన హృదయంలో ఆమె వసిస్తుందనడంలో ఉన్న గూఢార్థం ఇదే. ఆమె ప్రత్యేకంగా స్వామికి చెప్పేదేం లేదు. వారిద్దరూ ఒక్కటే. అయినా ఒక స్వారస్యం కోసం రామదాసు చేసిన ఈ ప్రయత్నం గొప్ప ప్రసిద్ధిని పొందింది. త్యాగరాజు కూడా ఇలా అమ్మను ప్రార్థించడం మనం చూడవచ్చు. వీరందరికీ మార్గదర్శకుడు తాళ్లపాక అన్నమాచార్యులు!

**మరికొన్ని భక్తి భావాలు**

**వాత్సల్య భక్తి**

"జో రవికుల శుభాంగ - జో సన్నుతాంగా
రార కరుణాంగ - రమ్యాంతరంగా ॥జోజో॥
శ్రీవెలయ పాలవా - రిధి బవ్వళింపా
దేవ బృందములెల్ల - దివి సన్నుతింపా ॥జోజో॥

భగవంతుడిని బిడ్డడుగా భావించి లాలపోయడం జోల పాడడం భక్తికి పరాకాష్ఠ.

శరణాగతి భక్తి వైష్ణవం వ్యాపించిన దశలో ఎక్కువ ప్రాధాన్యాన్ని



సంతరించుకొన్నది. ఆ ప్రభావం రామదాసు కీర్తనలలో స్పష్టంగా కనిపిస్తుంది. "రామదాస స్తుతి నిదానం" అని రాముడిని సంభావిస్తాడు.

"దాసార్చిత మాకభయ మొసంగవె దాశరథీ రఘురామా" అని ప్రార్థిస్తాడు. "చరణములే నమ్మితి నీ దివ్య చరణములే నమ్మితి, వారధి గట్టిన వరభద్రాచల వరదా వరదా వరదా" అని శరణాగతి భక్తికి నిదర్శనంగా చెప్పదగిన కీర్తనలనెన్నిటినో రచించి భజన కూటములలో పాడుకోవడానికి అనుకూలమైన రాగాలతో స్వరపరచి భక్తి సాహిత్యంలో చిరస్థాయిని పొందాడు రామదాసు. ఎన్నెన్ని విధాలుగా భగవంతుడిని కీర్తించడానికి స్మరించడానికి వీలుందో అన్ని విధాలుగాను భజించి, సేవించి ధన్యుడయ్యాడు.

**ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాద్‌వారు 2006 ఏప్రిల్ 7-9 తేదీల్లో నిర్వహించిన 'తెలుగు వాగ్గేయకారులు - అన్నమయ్య విలక్షణ వ్యక్తిత్వం' సదస్సులో సమర్పించిన ప్రసంగపత్రం**